1

# లోకచరిత్ర

(నవల)

రచన:

ధనికొండ హనుమంతరావు

వినోద గ్రంథమాల

:: తెనాలి ::



12 అణాలు

ఇతర పుస్తకాలు :

ఇలవేల్పు 0-8-0
ప్రియురాలు 0-6-0
గర్వభంగం 0-6-0
పెం కొడుకు 0-2-0

రచన: జూన్, 1940
మొదటి ముద్రణ: ఫిబ్రవరి, 1943

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి

# లోకచరిత్ర

ఆ రోజులు నా మనస్సులోంచి ఇంకా మాయమైపోలేదు; ఏ కూ చింతా లేకుండా, జీవితంలో కష్టాలంటే ఎల్లాటివో తెలియని రోజు లవి. ఇంటికి ఆలస్యంగా వొస్తే, "ఎక్కడికి వెళ్ళారు!" అని సాగ తీసి అడిగే అనుమాన పిశాచంలాటి భార్య కానీ, "నాన్నా! నన్ను కూడా తీసుకు వెళ్ళు" అని ఆఫీసుకు వెళ్ళేవాణ్ణి పంచపట్టుకు లాగే కూతురు కానీ, "ఈ నెల్లో నన్నా మా బాకీ రద్దు చెయ్యాలి సుమండీ!" అని—నాకు తెలియకుండా అమ్మగారికి అరువుపెట్టి, వెంటాడే నక్షత్రకుడిలాటి బట్టల సాహుకారు కానీ—కనీసం ఉంటారని ఊహించుకోలేని లేబ్రాయపు దినాలవి. కొడుకు స్కూలు ఎగగొట్టకుండా వెళ్తున్నాడనే తల్లి సంతోషమూ, ఎల్లా ఏడిస్తేనా ప్యాసవుతున్నాడు అదే పదివేలని, ఆనందించే తండ్రి అమాయకపు ప్రేమలోనూ — నిర్విచారంగా, నిర్భయంగా టళాయించి తిరిగే విద్యార్థిదశలోని రోజు లవి. ఒకవిధంగా చూస్తే—నా జీవితంలో అవ్వే వేళ్ళు ముడిచి చెప్పుకోదగ్గ ముఖ్యదినాలేమో ననిపిస్తుంది.

ఒకటి, రెండు దండయాత్రలుకొట్టి స్కూలుఫైనల్ వరకూ లేకా వనే కీర్తితప్ప—నా దగ్గర అప్పట్లో చెప్పుకోదగ్గ గొప్పతనమే లేదు. ఫోర్తుఫారంనుంచీ నన్ను విడవకుండా వెంటపడి వొస్తోంది—కనకం! వాళ్ళ ఇంట్లో నాకుండే చనువుతో — పగటిపూట — స్కూలు గంటలు మినహా ఎక్కువకాలాన్ని అక్కడే గడిపేవాణ్ణి. కనకం తల్లి రాజమ్మ—నేనంటే ఆమెకు ఒకవిధమైన గౌరవం. "నాయనా! నీతోపాటు అమ్మాయికూడా ప్యాసయ్యే మార్గం చూడు" అనేది. "నేను వదలాలన్నా కనకం వొదిలిపెట్టేట్టు లేదు లెండి" అనేవాణ్ణి; అప్పటి నా విజ్ఞానానికి ఇంతకన్న 'విట్టు' దొరికేది కాదు.

కనకానికి తల్లితప్ప ఇంకెవ్వరూ లేరు; తండ్రి తాలూకా గుమాస్తా చేసి—ప్రస్తుతం వాళ్ళు ఉండే ఇంటిని మాత్రం సంపాయించిచ్చి—యీలోకం నుంచి విరమించాడు. ముఖ్యంగా మే మిద్దరమూ పోలే విషయా లేమంటే—కనకం ఆమె తల్లిదండ్రులకు వొక్కతే కూతురు; నేను నా తల్లిదండ్రులకు వొక్కణ్ణే కొడుకును: ఇద్దరమూ గారాబంగా పెరగటంవల్ల—యిద్దరికీ మారామూ, బిగతీసుకు కూర్చోవటమూ బాగా తెలుసు.

# 2

వాన కురిసి అప్పుడే వెలిసింది; వానలో తడిసి కూర్చున్న చెట్ల మీదినుంచీ, నేలమీదినుంచీ వచ్చే చల్లగాలి ప్రాణానికి 'హాయి—హాయి' అనిపిస్తోంది. అలసి, సొలసిన మేఘాలు ఒక్కొక్కటే విడిపోతూ—కిటికీలోంచి కన్పించే దూరానవున్న పర్వత పంక్తుల వైపు పరుగులెత్తుతున్నాయి.

గదిలో కూర్చొని ఒక బండ అల్జీబ్రా లెక్కతో తంటాలు పడుతున్నా; అరగంటనుంచీ కొట్టుకొంటున్నా లెక్క తెమలదు. ఆన్సర్ చూసి—ఆఆన్సర్ వొచ్చేందుకు, హెచ్చవెయ్యాలో, భాగించాలో, కూడాలో, తీసెయ్యాలో—ఎల్లాగైనా పర్యవసానం పుస్తకంలోని ఆన్సర్‌కు సరిపెట్టే ప్రయత్నంలో వున్నా. ఎంత ఏడ్చినా ఆ బండ 'శతబండ' గానూ, 'సహస్రబండ' గానూ తయారౌతోంది. చివరికి విసుగుపుట్టి పుస్తకాన్ని చించి పారేద్దా మనిపించింది, కాని—మర్నాడు మాస్టరు చూసే కొరకొర చూపులూ, పబ్లిక్ క్లాసులో పట్టుకొని 'బెంచీ ఎక్కరా' అంటే నేను పొందే అవమానమూ, చిత్తక్షోభా జ్ఞాపకానికి వొచ్చాయి.

లెక్కగొడవతో కొట్టుకొంటున్నా నేకాని—కనకం వొచ్చి నిలువుటద్దంముందు నిలబడి సింగారించుకొంటున్న సంగతికూడా చూడలేదు.

పోయిన విలువైన వస్తువేదో ఉన్నట్టువుండి దొరికినప్పుడు పొందే సంతోషం లాటిది నాలో ప్రవేశించింది. చేతిలోవున్న పెరుమాళ్సెట్టి పెన్సిల్ సంగతి—పెరుమాళ్ళ కెరుక—ఎక్కడ పడ్డదో? అల్లాగే కనకం అందాన్ని కళ్ళతో తాగేస్తూ కూర్చున్నా.

బహుశా నా ప్రతిబింబం అద్దంలో కన్పించిందేమో—వెనక్కి తిరిగి, నవ్వుతూ, "ఏదో రాసుకుంటున్నావుగా—అల్లా చూస్తావేం?" అంది.

నే నొక గుటకమింగి, "ఈ వెధవ లెక్క రాక ఛస్తున్నా—" అన్నా.

"నీ గతి ఎప్పుడూ అంతేలే! నీకు చదువులోనే లోకం! స్కూల్లో నిన్ను 'Book worm' అని ఊరికినే పిలుస్తారా!"

"అల్లాగే తిట్టు—నేను లెక్కచేస్తే దాన్ని కాపీ కొట్టి...అంతా సొంతం లాగు మాస్టారికి చూపిస్తావు. ఈ గ్రంథ చౌర్యం ఆయనకేం తెలుసు? అయినా ఆ ముసలి మాస్టరుకు ఆడపిల్లలంటే ఆదో అభిమానం......ఇవ్వాళ చేద్దుకానిలే—"

ఆమె నా దగ్గరిసా వొచ్చి కూర్చొని, "రాజా! నువ్వు మంచి వాడివిగా! అసలు స్వతహాగా తెలివిగలవాడివి...నా పుస్తకంలో కూడా లెక్కవేసి పెట్టవూ?" అంది. నాలో వుండే మంచితనాన్నంతట్నీ వొక్కసారిగా గ్రహించినందుకు—నాకే నవ్వొచ్చింది. 'సరేలే' అన్నా, బహుశా నన్ను పొగడినందుకేమో?

ఎన్నడూలేని కొత్త అందం ఇవ్వాళ కనకంలో కన్పిస్తోంది. ఇది వరకు ఆమె వోణీలు వేసేది; ఉబికివున్న ఆమె వక్షాన్ని తాకేందుకు ఈనాటినుంచీ వోణీలకు హక్కులేదు. ఇవ్వాళ కొత్తగా చీరకట్టింది. ఎక్కడ నేర్చుకుందో—అంత అందమైన కట్టును? ఎన్నాళ్ళు నేర్చుకున్నా నాకు పంచకట్టుకోవటం తెలీదు...ఇంత త్వరగా కనకానికి యీవిద్య ఎలా అలవడ్డదో మరి? ఆ చీర—సరి కొత్తదని, చెంగుల్ని రాసివున్న పసుపు మరకలు చెప్తానే ఉన్నాయి. ఆమె మాటల్లోనూ

చేష్టల్లోనూ, చూపుల్లోనూ కూడా నూతనత్వం గోచరమవుతూనేవుంది. వాలుజడను ఎడంభుజం మీదినుంచి జార్చి—జడ చివర్ని మునివేళ్లతో సర్దుకుంటూ—నన్ను క్రీగంట చూస్తోంది. నాలో కూడా ఆమె కేమన్నా నూతనత్వం కన్పిస్తోందా ? ఏమో ! ఆమె కళ్ళల్లోంచి వెలువడే కాంతులు ఎంత 'ఆశ'ను చూపుతున్నయ్యో ! ఆశ ! ఇది లేనినాడు మానవత్వమే నశిస్తుంది ! లోకంలో ఉన్నా లేనట్టే తోస్తుంది.

ఇంతకు పూర్వం నాకు తెలియకుండా నాలోని శక్తి ఏదో—నన్ను కనకం వైపు తోస్తోందని నాకు తెలుసు. ఆ శక్తి ఏమిటో దాని లాభ నష్టాలేమిటో నాకు తెలీదు. కాని, ఒక్కొక్కప్పుడు 'కనకం నాదైతే ఎంత బావుండును' అనిపించేది; నాదైతే ! ఒక మనిషి ఒకరి సొత్తు ఎలా అవుతారు ? అంటే ఆమె నా భార్యయి—నాతోనే జీవితం అంతా గడపమనా—నా అభిప్రాయం ? ఏమో ! ఆ వివాహం సంగతి కూడా ఏదో వినటమే కాని—దాన్ని గూర్చి యింకా నేర్చుకోలేదు.

ఈనాడు కనకంలో వున్న కొత్త మెరుగులన్నీ కలిసి నాలోని ప్రతిశక్తినీ, ప్రతి అణువునూ ఆకర్షిస్తున్నాయి. ఇదివరకు ఎన్నడూ లేని భయం వొకవైపునుంచి నాలో ప్రవేశిస్తోంది. కనకానికి భయం లేదు కాబోలు ? నిశ్చలంగా నిలబడి జాకెట్ కాలర్ కిందినుంచి పమిటను పోనిచ్చేందుకు ప్రయత్నిస్తోంది. ఆమె చేసే ప్రతి పనీ నా ఉద్రేకానికి కారణమౌతోందని ఆమెకూడా తెలుసేమో ?

"కనకం—ఇదెప్పుడు నేర్చుకున్నావ్ ?" సన్నని గొంతుతో "ఏది?" అంది. ఆమె కంఠంలో మాధుర్యమూ, మార్దవమూ, సంగీతమూ నాకు స్ఫురించాయి.

"ఈ చీరకట్టుకోవటం—"

ఆమె నవ్వి "యిదా?...పదహారేళ్ళు వచ్చినా యింకా వోణీలు వెయ్యమంటావా ?" అంది, నవ్వుతూ. ఆమె నవ్వుతూన్నప్పుడు—

ఆమె పలువరుస కూడా నాకు కొత్తగానే కన్పించింది.

"అది కాదు—ఎప్పుడు నేర్చుకున్నావ్—? అంటున్నా."

"నేర్చుకోవట మేమిటి? ఎన్నాళ్ళు నేర్చుకోవా లేమిటి?..." అంది. 'ఇదేమంత కష్టసాధ్యమైనవిద్య?' అన్నట్టు చూస్తూ.

"నీ కొత్త కట్టు...కన్పిస్తూనే వుందిలే..." నవ్వా—ఆకట్టులో లోపం ఏదో నాకు మహా తెలిసినట్టు.

"నీకు చీరెలు కట్టుకోవటం కూడా తెలుసా? ఒకసారి మా యింట్లో పట్టుబట్ట కట్టావ్...జ్ఞాపకం వుందా? అచ్చగా—అవధాని గారి పెళ్ళాం...కాశీ పోసి కట్టినట్టు...వెనకాల తెరచాపలాగు..." విరగపడి నవ్వుతోంది.

"ముందు నవ్వన్నా; చెప్పు; చెప్పన్నా నవ్వు." నాలో తప్పుపట్టిం దన్న అభిమానం లేకపోలేదు.

ఆమె ఆపుకోలేక ఆపుకోలేక, నవ్వును ఆపుకుంటూ, "అప్పుడు నేను ఏమనుకున్నానో తెలుసా—రాజూ? అభినవ వామనావతారం ..." మళ్ళీ నవ్వు సాగించింది. స్కూల్లో ఎన్ని డ్రిల్లు క్లాసులకు వెళ్ళినా పొడుగు ఎదగనందుకు—రమ్మని చంపుకుతినే డ్రిల్లు మాస్టర్ని తిట్టుకున్నా.

రెండు నిమిషాలు నవ్వి మళ్లీ సీరియస్‌గా ముఖంపెట్టి, "ఆఁ ... మరిచిపొయ్యా...నాటకంలో ఆడవేషం వెయ్యమన్నారని చెప్పావ్ కాదూ?...వాళ్లేమన్నా నేర్పారా యేం?" అంది.

నాకు యిందాకటి బండలెక్క జ్ఞాపకమొస్తోంది. "ఛా...వెధవ ఆడవేషం—" అన్నా అది నా డిగ్నిటీకి తెచ్చేలోపం భరించరానిది అన్నట్టు.

"ఏం—మగవేషంలో ఉన్న ఘనందు ఆడవేషంలో లేదూ?"

"ఎప్పటికీ వుండదు; ఈ మీసాన్ని తీసేసి (ఎవ్వరూ చూడకుండా గదిలో కూర్చొని, నా నూనూగు మీసాన్ని మెలేసుకోవటం నాకో సరదాగావుండేద)...చెవులకు కోతలాగులోలాకుల్ని తగిలించుకొని...

ముక్కుకుపుడక పెట్టి...నాగరికత అంతా మనలోనే మూర్తీభవించినట్టు...ఒళ్ళు అష్టవంకర్లూ తిప్పుకుంటూ...కళ్ళను సున్నితంగా ఆడిస్తూ...ఒయ్యారమైన నడకతో...లేని గొంతును తెచ్చిపెట్టుకొని...కీచురాయిలాగు సన్నని కంఠంతో మాట్లాడుతూ...ఛీ...అలా చేతకాని వేషాల్ని వేస్తే...అందరూ నవ్వి..."

"నీకు బ్రాన్స్ మెడల్స్‌నీ, లెదర్ మెడల్స్‌నీ, కార్డ్ బోర్డ్ మెడల్స్‌నీ, జర్మన్ సిల్వర్ మెడల్స్‌నీ...యిస్తారు" యింకా జ్ఞాపకం రాలేదు కాబోలు—ఆగి విరగపడి నవ్వుతోంది. నేను కూడా ఆమెతో శృతికలిపా. నవ్వి నవ్వి ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

కొంత సేపయ్యాక ఆగి, "ఇంతకూ ఆ వేషానికి వొప్పుకున్నావా!" అంది. యింకా పొడిదగ్గులాగు మధ్యమధ్య నవ్వుతూనే!

"ఛత్—"

"ఫర్వాలేదులే—ఒప్పుకో—నేను నేర్పుతాగా. ఆడవాళ్ళ కట్టూ, బొట్టూ...అవన్నీ..."

"అందుకని నన్ను స్త్రీని కమ్మంటావా?"

"అప్పుడు ఎల్లా వుంటావో చూడాలని వుంది" ఆమె మళ్ళీ నవ్వులోకి దిగింది; నిజంగా వేషం వేస్తే—యింకెంత నవ్వునో! నన్ను గూర్చి యిల్లా నవ్వటం నాకు కష్టంగానే వుంది కాని, కనకం కాబట్టీ ఒంటరిపాటు కాబట్టీ చచ్చినట్టు సహించి వూరుకున్నా.

"నీకేమన్నా మతిపోయిందా—అల్లా నవ్వుతావ్?" ఇప్పటికి ఆమె నవ్వు ఆపింది; పెద్ద తుపాను కొట్టి వెలిసినట్టయింది.

సీరియస్‌గా ముఖం పెట్టి, "రాజూ! పోనీ కాని - నిజంగా చెప్పు—నా కట్టులో తప్పు వుందా?" అంది.

ఆమెను ఎగాదిగా చూసి, లేని నవ్వును తెప్పించుకుంటూ, "ఓ! అదేం కట్టు?...మాయింట్లో పనిచేసే అప్పులమ్మ..." నేను నవ్వటం మొదలెట్టా, యిందాక నన్ను ఎగతాళి చేసిందనే కసి తీరేందుకు.

ఆమె కనుబొమ్మల్ని చిట్లించి, "అందుకే కోపం వొచ్చేది—

వేళాపాళాలేదు—వేళాకోళానికి—" అంది. ఇందాక తనకు యీ రూలు వర్తించనట్టు. పాపం—సుకుమారి (కనీసం నా దృష్టిలో) విసుక్కుంటుందేమోనని—యిందాకటి అవమానాన్నంతట్నీ దిగమింగా.

"ఏం చెప్పవూ!" అంది, నా ముఖకళను పట్టి, నా moodను కూడా గ్రహించినట్టు.

"చాలా బాగుంది...అరితేరిన ఆడది కట్టినట్టుగా వుంది...ఏం... చాలా?"

కొద్దిగా ముఖం ముడిచి, "నిజంగా బాగుందా?"—అంది.

"నిస్సందేహంగా—ముమ్మాటికీ—నీతోడు..." ఇంకా ఏమేం ఒట్లు ఉన్నయ్యా అని చూస్తున్నా.

ఆమె తృప్తిపడ్డట్టు చూస్తూ, "నాకు కొంచెం సిగ్గుగా వుంది—, రాజా" అంది

"దేనికీ?"

"ఇల్లా చీరెకట్టుకొని స్కూలుకు రమ్మంటావూ?" తలవూపా.

"అందరూ నవ్వుతారు—"

"నవ్వని—వాళ్ళ పళ్ళే బైట పడతాయి; నువ్వు కూడా నవ్వు - యిందాక నవ్వేలా—అట్లా"

"రాజా! నిజంగా బాగుందా?"

"నిస్సంశయంగా — సరేనా?" కనకం మరోసారి అద్దంలో చూసుకొని, ఎందుకో నవ్వింది; ఆ నవ్వులో వెన్నెల వెలుగున్నట్టు నాకు స్ఫురించింది.

'కనకం నాకు కావాలి!' ఇది నాలో పని చేస్తూన్న కోరిక; నాకేమిటి—వీలైతే చాలామందికి కావాలి; ఆమెను ఎన్ని హృదయాలు కోరుతున్నయ్యో—అందులో నాదికూడా వొకటి. కాని వీళ్ళందరి కన్నా నేనే ఆమెను కోరేందుకు అర్హుణ్నన్న ధీమావొకటి వుంది. దీనికి కారణం నాకే తెలీదు. ఆమె యిస్తూన్న చనువా? పూర్వపు సౌహార్ద్రి

బలమా ? ఆమెతల్లి నాలాంటి యువకుణ్ణి నమ్మి యువతి అయిన తన కూతురుతో స్వేచ్ఛగా చదువుకునేందుకు యిచ్చిన అనుమతా?—నా లోని అహంకారమా ? కామవ్యామోహమా ? ఇవన్నీనా ? ఇంకా నాకు తెలీనివి కూడానా ? ఏమో !

ఎలా చెప్పేది—నాహృదయాన్ని విప్పి ? ఈభాషలో నా హృదయాన్ని విప్పేందుకు కావాల్సిన మాటలే కరువైనాయి; అది నా తెలుగు పండితుని ప్రతిభో—నా మట్టిబుర్ర మహాత్మ్యమో-మరి !

నాకు తెలుసు—నాలో ఇదివరకు ఎప్పుడూలేని కొన్ని కొత్తశక్తులు పనిచేస్తున్నాయని. ఈ లోకమూ, ఇల్లూ, వాతావరణమూ, నాన్నా, అమ్మా—అందరూ నాకు మరపుకు వొచ్చారు; నాలోకం—ఆ గదే! నేను అప్పటివరకూ గడిపిన జీవితానికి—ఒక్క కనకాన్ని పొందటమే పర్యవసానం. ఇంతకన్న నాజీవితంలో అప్పటికి పరిష్కరింపబడాల్సిన సమస్యే లేదు. వెనక్కు వెనక్కు పోతూన్న ధైర్యాన్ని చిక్కబట్టు కుంటూ, అమితోద్రేకంతో తూలిపోయ్యే శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ, "కనకం!" అన్నా—నా జీవితంలో నా చెవులు వినని కొత్త స్వరంతో.

ఆమె నాదగ్గరికి వొచ్చి "ఏం?" అంది.

నేను కోరిన కనకం—నా ప్రపంచాన్నీ, నా ఊహల్లో అధిక భాగాన్నీ ఆక్రమించిన కనకం నాకు ఎంత సమీపంలో వుంది!

"కనకం...నిన్ను...నేను...ప్రేమిస్తున్నా"

ఆ 'ప్రేమ' అనే మాటను వాడటానికి అదే మొదలు. అది ఎల్లా వుంటుందో, దాని పుట్టు పూర్వోత్తరాలేమిటో, నాకేమీ తెలీదు. చాలామంది ఆ పదాన్ని వాడటం నాకు తెలుసు. ఆమె ఆశ్చర్య పోయినట్టు చూస్తూ నిలబడ్డది.

ఆమె చూపులు నన్ను నిరుత్సాహపరచినా విశాలమైన ఆమె కళ్ళూ, ఎర్రని ఆమె చిరుపెదవులూ నన్ను ఆకర్షించాయి. ఆమెను ఏమేమో చెయ్యమని పొంగి పొరలుతూన్న ఉష్ణరక్తం

నన్నింకా ముందుకు సాగనంపుతోంది. కనకంలో నేను చూడని—కాని విన్న—రంభా, ఊర్వసులు ప్రవేశించారు. కామాంధకారం నా కన్నుల్ని కప్పిందేమో కాని, నాకేం కన్పించటం లేదు; నేను చెయ్యబొయ్యే పనేమిటో—అపని చెయ్యవచ్చో, చెయ్యకూడదో కూడానాకు చెప్పేందుకు - నాలోని ఏశక్తీ సహాయపడటంలేదు. ఆమె చేతిని గట్టిగా పట్టుకొని, దగ్గరకు లాక్కొని ఆమెను ముద్దుపెట్టుకొని పరవశుణ్నయ్యాను.

— గాజులు గల్లు మన్నాయి; చెంప ఛెళ్ళు మంది; గూబ గుంయ్ మంది; ఒళ్ళు ఝల్లు మంది. నాలో ఉన్న ఉష్ణరక్తమంతా శీతలమై దిగిపోయింది; చెయ్యి దానంతటదే స్వస్థానాన్ని జేరింది: జలుబు నీళ్ళు కాసినీ వదలిపొయ్యాయి. నేను అన్న ప్రేమా, గీమా అంతా మటుమాయమైంది. ఆ దెబ్బతో దేవేంద్రలోకం కన్పించి, తాతలూ, ముత్తాతలూ జ్ఞాపకానికి వొచ్చారు. మళ్ళీ యథాప్రకారంగా తిరిగి మ మూలు 'రాజు'ను ఆయ్యాను. తిరిగి యీలోకంతోనూ, యీమనుష్యులతోనూ, ఇందాక సగంచేసి విసుగెత్తి ఊరుకున్న బండ లెక్కతోనూ, అవసరం కలిగే మానవుడిగా మారిపొయ్యాను.

కనకం ముఖం కోపంతో ఎర్రబడ్డది; ఆమె చూపులకే పదును వుంటే—నా శిరం నేలరాలి వుండేది; ఆమె చూపులకే అగ్నికున్న శక్తి వుంటే నేను నిలువూనా దహింపబడి వుండేవాణ్ని. ఆమె పెదవులు ఒణుకుతున్నాయి. నాచేతి ఒత్తిడికి గురిఅయిన చేతిని సరిచేసుకుంటూ, నాకు దెబ్బను ప్రసాదించిన అరిచేతిబలాన్ని కాబోలు చూసుకుంటోంది. ఏదో తప్పుచేశానని నానేరం గొప్పదనీ నాలో నాకే ఎవరో చెప్తున్నట్టు తోచింది.

"రాజా!..." అంది. నేను మాట్లాడలేదు; నా బుర్రగిర్రున తిరిగిపోతోంది.

"నువ్వు మంచివాడివనుకున్నా...లేని చనువును తీసికొని... అసలు నేను ఇచ్చినందుకేగా ఇంతపనీ చేసింది?...ఛీ—యీ మొగా

ళ్ళను నమ్మకూడదు...ఉన్నట్టువుండి ఒళ్ళూపై తెలియని పనుల్ని చేస్తారు..." ఆగింది.

ఆమె మానవమాత్రురాలు కాదూ! నాలాంటి ఊహాలూ, అనుభవాలూ ఆమెకులేవూ! నేనేం తప్పుచేశాను? నాదనుకొన్న కనకం—నాకు బాగా అర్థమైందనుకొన్న కనకం...నాకు కశృత్వాన్ని ప్రదర్శిస్తూ, కోపంతో కంపించే శరీరంతో—నాఎదుట ప్రత్యక్షమైంది; ఏం చెప్దామన్నా గొంతుదాకా వొచ్చిన మాటలు వాటంతటవే వెనక్కు వెళ్ళిపోతున్నయ్.

"ప్రేమట...ప్రేమా, గీమాను. ప్రతివాడికీ ఇదొకటి తెలుసు...ఛీ......స్కూల్లో చదువుతున్నారు...వెధవలు...వాళ్ళూ అంతే! స్కూలు వదలటం ఆలస్యం—ఇంటిదాకావొచ్చి దిగపెట్టి వెళ్తారు—తోడుశేరనే భయంలేకుండా! కుక్కల్లాగు వెంటపడతారు—అంతా వీళ్ళ తాతగాడిసొమ్మైనా నాదగ్గర దాచిపెట్టినట్టు—నేనేవో వీళ్ళకు ఒరిగిస్తాననుకుంటారు. కొంతమంది వెధవలు షీట్స్కూడా చేస్తారు—అదంతా నేను చూసి తన్మయత్వం పొందుతాననే వాళ్ళ ఊహ! నేనొక దేవతనైనట్టూ, వీళ్ళందరూ తపస్సుచేసి నాదగ్గర వరాలు పొంద దల్చుకున్నట్టూ ప్రవర్తిస్తారు; వీళ్ళల్లోంచి నిన్ను మినహాయించొచ్చనుకున్నా......నువ్వుకూడా ఇల్లా తయారయ్యావూ!..."

గూబ గుయ్యిమంటం ఆగింది. చెంపను చెయ్యిపెట్టుకొని అయిదు వేళ్ళూ తేలిన వాతను తడువుకొంటున్నా.

"ఉండు నీపనిచెప్తా...మీవాళ్ళతో చెప్పనా? మా అమ్మతో చెప్పనా? హెడ్మాస్టారితో రిపోర్ట్ చెయ్యనా?" ఇంకెవ్వరూ లేరు కాబోలు చెప్పేందుకు—ఆగింది.

నాసంగతి వీళ్ళందరితో చెప్తే...నన్ను కొడుతారు...తిడతారు—అంతేనా? ఆడదానికి కాస్త సందుదొరుకుతే దబాయించేస్తుంది. తన బెదరింపులకు, నేను తనను ప్రాధేయపడతాననీ, క్షమించమని కాళ్ళా వేళ్ళా పడతాననీ అనుకొంది—కాబోలు! నేనూ మనిషినేననీ,

నాకూ వ్యక్తిత్వమూ, ఆత్మగౌరవమూ, ఆత్మాభిమానమూ వున్నాయని ఆమెకు తెలియదు కాబోలు! ఒకవిధమైన రోషంతో నాకు ఉద్రేకం వొచ్చింది.

“చెప్పుకో; అందరితోనూ చెప్పుకో—దేవుడుకూడా దార్లో ఎదురైతే చెప్పు—నేను అన్నింటికీ తెగించి కూర్చున్నా; అసలు దీనికంతకూ నువ్వేకారణం—” మాటలు రాక ఆగా; నాలో భయం పోయి, మొండిధైర్యం ప్రవేశించింది.

ఆమె విస్తుపోయి చూస్తూ. “ఏమిటీ! నేనా! నేనేంచేశానూ!” అంది.

“నువ్వా?—ఆఁ నువ్వే! నువ్వు నన్నెందుకు ఆకర్షించావు! నన్నెందుకు భ్రమపెట్టావూ? నువ్విదంతా చెయ్యకపోతే—నేనీపనిని చెయ్యనుగా! ఇదంతా నా ఒక్కడి తప్పులాగే చెప్పేస్తానని భయపెడుతున్నావ్! నేను వెళ్ళిపోతా...ఇంకెప్పుడూ మీ ఇంటికి రాను ఇంకెప్పుడూ నీతో మాట్లాడను—” మాటలు రాలేదు. ఒకవిధమైన విచారంతో గుండె నిండిపోయింది. ‘చెప్తా’ నంది. ‘నిజంగా చెప్తుందేమో?’ అనే భయం వొకవైపు. ‘ఎందుకు చేశానూ—ఇల్లాంటి పని!’ అనే తర్కం వొకవైపు; చిన్న పిల్లవాడిలాగు అరచేతుల్లో ముఖాన్ని దాచుకొని ఏడ్చాను; కళ్ళు గట్టిగామూసుకున్నా—ఎదుట వున్నదంతా మరిచిపోదామని.

కనకం నా పక్కనే కూర్చొని నా తల నిమురుతోంది; బహుశా నా ఏడుపుకు జాలిపడ్డదేమో? ఎల్లాగైనా యీ అపాయాన్ని దాటి, యీ ప్రాణ గండాన్ని తప్పించుకుంటే—ఇంక జీవితంలో ఎప్పుడూ ఇల్లాటి పని చెయ్యకూడదని నిశ్చయించుకున్నా. అయోమయమూ, అగాధమూ అయిన స్త్రీ హృదయాన్ని గ్రహించేందుకు బ్రహ్మ దిగి రావాలని గ్రహించా.

“రాజూ!” అంది లాలనగా. నిప్పులేకుండానే భగభగమని మండుతూన్న నా ఎండు గుండెకు—ఆమె స్వరంలోని అమృతం

కొంత శాంతి నిచ్చింది. కాని నే నేం మాట్లాడలేదు.

"నీ కేమన్నా మతిపోయిందా—ఏడుస్తావ్ దేనికి?"

ఈ గొడవంతా ఆమెతో ఎక్కడ చెప్పుకునేది? ఒక స్త్రీదగ్గర ఏడ్చే పురుషుణ్ని చూసి— (ఇప్పుడు మీరు విని) హేళన చేస్తారనే సిగ్గు బాధిస్తోంది. కొంత ప్రయత్నంమీద ఏడుపు ఆపుకున్నా. ఇందాకటి సరసమంతా విరసమయి, నవ్వు ఏడ్పు కింద మారుతుందని అనుకుంటే—వ్యవహారాన్ని ఇంతవరకూ రానిచ్చేవాణ్ని కానేమో!

"సిగ్గులేదూ? ఎక్కడైనా పురుషుడు ఏడవడమనేది విన్నావూ!"

మళ్ళీ తిట్టడం మొదలెట్టింది. పురుషులు మాత్రం మానవులు కారూ? వాళ్ళు మాత్రం ఏడవరూ? కాకపోతే, చాటుగా, మాటుగా ఎవరి కళ్ళా పడకుండా—ఏడుస్తారు; స్త్రీ అయిన కన కాని కేం తెలుసు—పురుషుల గొడవ? అందులో మునగానాం, తేలానాం అన్నట్టు నా స్థితిలోవున్న పురుషుడి సంగతి కేళే చెప్పాలా? మళ్ళా ఏడుపు సాగించవా వొద్దా అని ఆలోచిస్తున్నా.

"రాజా! ఎందుకు కళ్ళనీళ్ళు పెడతావ్? చెప్పనులే... ఎవరితోనూ చెప్పను. కాని, ఇంకెప్పుడూ ఇల్లాటి పని చెయ్యవోక..."

ఇంకానా? బొందిలో ప్రాణం వున్నంతవరకూ చెయ్యటమే? ఎవ్వరితోనూ చెప్పనంది—అంతకన్న ఇంకేం కావాలి? నా లక్ష తిప్పల్ని కాచినట్టు; ఏమో! అయినా నమ్మకం యేమిటి?

"నిజంగా—చెప్పకుండా వుంటావా?" దీనంగా, జాలిగా, బాధగా చూశా... ఆమె హృదయాన్ని కరిగించాలని.

"నిజంగా చెప్పను—"

"ఒట్టెయ్యి—"

మృదువైన హస్తంతో మెల్లిగా నా చేతులో ఒట్టేసింది; నా చిటకా పనిచేసినందుకు నాలో నాకే తృప్తికలిగింది. పోయిన ప్రాణం తిరొచ్చినట్టూ, ఉరితాటిలోంచి మెల్లిగా మెడ ఇవతలికి లాక్కున్నట్టుగా వుంది!

"రా...జూ!" అంది నా ముఖంమీద వాలిన క్రాపును పైకి తోస్తూ. ఎవరిచ్చారో తనకా అధికారాన్ని! ఇప్పుడు నేను యీ సంగతి అందరితోనూ చెప్పి డబ్బా వాయించేస్తానంటూ లేస్తే, నా మాట ఎవరు నమ్ముతారు! పైపెచ్చు ఎదురొతుంది కూడా.

"ఊఁ" అన్నా ఇంకా ఏడుపు గొంతుతోనే.

"కోపం వొచ్చిందా!" వొచ్చిందంటే—ఏం ప్రమాదమో? నిజంగా కనకాన్ని మింగేద్దా మన్నంత కోపం వుంది.

"లే—దు"

"ఎందుకు అ్లాంటి పనిచేశావ్!" నా పాఠకుడికి నా కష్టాల్ని చెప్పుకున్నంత విపులంగా—ఆమెకు ఎక్కడ చెప్పేది?

"ఏమో—నాకు తెలియదు" నాకు తెలుసు—మనస్త్రాలు తెలి యక చేసే తప్పులు కొన్ని వుంటాయని—ఆ గుంపులోకి దీన్నికూడా తోసేశా.

ఆమె కొంచెం ఆగి, "నేనంత బాగున్నానా?" అంది. ఇందాక నా కళ్ళకు ఎంత బాగుంది! అప్పుడు వర్ణించేందుకు భాషలోని పదాలు కూడా చాల్లేదు. ఇప్పుడు—నా కళ్ళకు ఏమీ బాగా లేదు. ఆమె మీద కోపమూ, నా అవమానమే దీనికి కారణమై వుంటుంది. ఎంత బాగుండకపోతే—ఏమీ తెలీని నేను—నా జీవితంలో మొట్ట మొదటి ముద్దును కనకానికి ఇస్తాను? తద్వారా—మా అమ్మ తప్ప ఇతర్లకు తాకేందుకూ్కూడా అధికారం లేని—చెంపమీద లెంపకాయ తింటాను?

"ఏం—నేనంత బాగున్నానా?" మళ్ళీ అడిగింది. తన అందా నికి ఆహుతి అయిన నన్ను చూసి గర్విస్తోంది కాబోలు!

ఆమె వైపు చూడకుండానే, "చాలా బాగున్నావు—నన్నెందు కిలా ఏడిపిస్తావ్!" అన్నా.

"ఏం చేశాను!" అంది తను నిర్దోషి అయినట్లు.

"చూడు—ఎంత దెబ్బ కొట్టావో? చెంపమీద ఐదువేళ్ళూ

తేలాయి—"

ఆమె చూసి, తనకుతను నొచ్చుకుంటూ, "ఏదో కోపం వొచ్చిం ది—ఇంత దెబ్బ తగులు తుందనుకోలా—మెల్లగానే కొట్టా" అంది. నా నేరానికి యీ దెబ్బ అని ఏ పీనల్ కోడ్ లోవుంది ? నాన్నకూడ నన్నెప్పుడూ ఇంత దెబ్బ కొట్టలేదే ? మెల్లిమెల్లిగా కనకంమీది కో పాన్ని దిగమింగుకుంటున్నా.

"కళ్లలా ఎర్రపడ్డయ్యో చూడు—ఎవరు చెప్పారు నీకుఇల్లా చెయ్య మని ?" ఎవరు చెప్పాలి ? పిల్లవాడు పుట్టంగానే పాలుతాగమని ఎవరు చెప్పారు ? ఏడవమని ఎవరు బోధించారు ?

"ఎవరూ చెప్పలా—అల్లా బుద్ధిపుట్టింది—"

"పోనీ—నన్నెందుకు అడగలేదు ?"

"కోప్పడతావని" దీంట్లో ఏదో అర్థం కాని నేరం వుందని నాకు స్ఫురించింది. ఆమె నావైపు చూసి చిరునవ్వు నవ్వింది ; పూర్వం లాటి వెన్నెల ఆ నవ్వులో నాకు కన్పించటం లేదు; ఎల్లాగైనా బతికి బైటపడితే చాలుననే పద్ధులో వున్నా.

"రాజూ—నా మీద నిజంగా నీకు కోపంలేదూ !" కాస్తో, కూస్తో ఉంది కాని పైకి చెప్పటానికి భయం.

"నిజంగా లేదు—"

"మరేం అనుకోకు—ఆ దెబ్బ ఏమిటని మీ వాళ్ళు అడుగుతే ఏం చెప్తావు ?" ఏదో బొంకి నా ఏడుపు నేను ఏడవాలని తెలుసు.

"నువ్వు కొట్టావని చెప్తా—అబద్ధమాడటం దేనికి ? నిజమేచెప్తా" అన్నా ఏమంటుందోనని.

"ఓ హరిశ్చంద్రా ! — నిజం చెప్తే ఎందుకు కొట్టిందంటే ఏం చెప్తావు ?"

"ఇదంతా చెప్తా—"

"ఆ, చెప్పు...మరికొంతమందికి పాఠం నేర్పి పుణ్యంకట్టుకో" అంది. ఈ పరువునష్టపుపని చేసిందికాక, ఇంకెవరితోనన్నా ఏమని

చెప్పుకుంటానని—ఆమెకూడా తెలుసేమో!

ఇంటికి వెళ్దామని పుస్తకాలు సర్దుకుంటున్నా.

"రాజా—మళ్ళీ ఎప్పుడొస్తావ్?"

"ఇం కెప్పుడూ రాను—న న్నింకా ఏడిపిస్తావ్—నువ్వు నాకు కన్పిస్తూవుంటే పిచ్చెత్తినట్టుంటుంది. ఆ పిచ్చిలో...పిచ్చిపనుల్ని చేస్తే నువ్వు సహించలేవు; రసాభాస అవుతుంది...పోనీ...నన్ను ఇంతటితో పోనీ......ఇం కెప్పుడూ జీవితంలో ఇల్లాంటి సంఘటన వొద్దు." ఒకవిధమైన విరక్తితోనే (అప్పటి నా దృష్టిలో) యీ మాటల్ని అన్నా.

ఆమె సబురాలై విని అంది: "రాజా! ఇల్లాంటి చిన్నతనంలోనే ఇంత పెద్దఊహాలా? నేను వుండటంకూడా నీకు యిష్టం లేమా?" చిన్నబుర్రలో పెద్దఊహాలకు తావు వుండదూ? శరీరపరిమాణాన్ని పట్టి విజ్ఞానమూ, ఊహాపోహాలూ వుంటే—చాలామంది అజ్ఞానులు జ్ఞానులుగా తయారయ్యేవాళ్ళు!

"నాకు నీమీద కోపం లేదు; ఒకవేళ ఉన్నా దాంతో నీకు అపకారం చెయ్యను; నన్ను పోనీ......ఇది నీ తప్పు కాదేమో! కాని నువ్వు నన్ను ఆకర్షించినంతకాలమూ—నేను తప్పుదారినే నడుస్తా. అయిందేదో అయింది—అంతా మరిచిపో..." గగనకుసుమానికి ఆశ పడటం వృథా అన్నట్టూ, అందని ద్రాక్షపళ్ళను చూసిన నక్క 'Sour grapes' అన్నట్టూ మాట్లాడాను.

ఆమె నిట్టూర్చి అంది: "రాజా! ని న్నింతగా గాయపరిచానా? నేనే తప్పుచేస్తే నన్ను క్షమించు — ఇంతమాత్రానికే మన స్నేహం పోవాలా? నువ్వు కోరేది నాకు తెలుసు...అదంతా దేనికి? నువ్వు మామూలుగానే వస్తూవుండు..."

నేను ఇష్టంలేని చూపుల్ని చూశా.

"నువ్వు ఇందాక ఏమన్నావ్...జ్ఞాపకంలేదూ? నన్ను ప్రేమిస్తు న్నానన్నావ్...ప్రేమించు, ఎవ రొద్దన్నారు? అసలు ఇంకోళ్ళకు

తెలుస్తేగా—నువ్వు నన్ను ప్రేమించినట్టు! అట్లా ప్రేమించటం నీకు ఆనందాన్నిస్తే—కాదనగల వారెవరు?...కాని నువ్వేకోరే దేహసౌఖ్యం...ఎందుకు మాయలోపడిమూఢుడివై పోతావ్...ఆలోచించు."

ఏమిటో యీ మెట్టవేదాంతం! ప్రేమ నట...హృదయంలో దాచుకొని...యీ జన్మకు ఇదేనన్నట్టు—దాన్ని పూజించాలట? హృదయాల్నీ, ఆత్మల్నీ, ప్రేమించేశక్తి—ఎక్కడుందో? ఈ నిష్కామకర్మలూ, అనుష్ఠాలూ—మానవాతీతమైన విషయాల్ని ఏ కరువు పెడుతోంది—

నాకు మాత్రం తలకాయ నొప్పిగా వుంది.

"పోనీ—రాజా! ఇందాక అంతపని చేశావే—అప్పుడు ఎవరన్నా చూస్తే ఎంత ప్రమాదం!"

మొత్తానికి యీ మెకూడా భయమున్నది వుందని నా కిప్పుడు తెలిసింది; ఇదేం ప్రాణగండం కాదని రుజువుచెయ్యగలుగుతే—ఆమె నాదైపోదూ! మళ్ళీ వెధవ ఆశ!—ఇందాకటిలా పరిస్థితులు ఎదురు తిరుగుతే? ఒకసారి వేలు కాల్తే మళ్ళీ నిప్పుజోలికి పోనీ, ఏమీ తెలీని కుర్రవాడు. నయం ఆమెకూడా ఉద్దేశమున్నట్టూ, కాని భయపడుతూన్నట్టూ నాకు తోచినా—నాకు ధైర్యంలేదు,—ఈ ధైర్యాన్ని కొని తెచ్చుకోలేంగా!

"అంత భయపడితే మనం జీవితంలో దేన్నీ సాధించలేం—" అన్నా ఎట్లాగో.

"దాంట్లో చాలా నష్టాలున్నాయ్. రాజా! నీకింకా తెలీదు—నీ వయస్సు కుర్రాళ్ళందరూ అంతే!" అంది. ఆమె ఏమో నాకన్న పెద్దదైనట్టూ, ఆమెఅనుభవం అసమానమైనట్టూను. ఆమెను సమాధానపరిచే విజ్ఞానమూ, శక్తీ నాలోలేవు; అయినా ఆమె అంటే వొక భయం ఏర్పడ్డది.

కాస్సేపాగి, నిలవతీసి అడిగినట్టు. "ఏం—వస్తావా!" అంది.

"వస్తాలే" అని తల ఆడించా; బైటికి పోయాక టలాయిం

చొచ్చని.

"ఒట్టెయ్యి"—ఈ ఆడవాళ్ళతో ఒట్లగోలా, ఎలక్షన్‌లో కాండిడేట్స్‌తో ఓట్లగోలా తప్పవు. తప్పని సరిగా ఒట్టేశా. ఈ ఒట్లూ, యీ వాగ్దానాలూ, యీ ప్రతిజ్ఞలూ పాలించేందుకు—మనం పాండవ మధ్యములమూ, భీములమూ కాదని తెలుసు! 'ఒట్టు'ను బుద్ధి తెలిసి నప్పటినుంచీ ఉపయోగిస్తూ వుండటంమూలాన, దాంట్లో వుండే నమ్మకమూ, విలువా కూడా జారిపోయినై.

వెళ్తూ వెళ్తూ నిశ్చలంగా నిలబడివున్న ఆమెవైపు 'ఇవ్వే కడసారి చూపులు' అన్నట్టు చూసి ఎట్లాగో బైటపడ్డా.

## 3

ఆ రాత్రి నిద్రాదేవి నాతో విరోధం పూనింది; బలవంతానైనా ఆమెను దగ్గరకు లాక్కోలేకపొయ్యాను. కనకం కొట్టిన దెబ్బ బాపతు ఫిరంగిమోత ఇంకా నా చెవుల్లో రింగురింగు మంటూనేవుంది. ఈ కనకాన్ని గూర్చిందే నా జీవితంలో మొట్టమొదటి సమస్యగా మొలకెత్తింది.

ఆ సాయింత్రపు సంఘటనతో నారీఛాయలోని దెయ్యాలూ, భూతాలు నాముందు భయంకరనాట్యాన్ని మొదలెట్టాయి. కనకం వొక్కతే ఇట్లాటిదా ? లోకంలో స్త్రీలందరూనా ? కోమలమైన స్త్రీ హృదయంలో కూడా పాషాణంలాటి పదార్థానికి తావుందా ? అప్పటి నా అనుభవానికి లోకమంతా 'కనకా'లమయమేననే అభిప్రాయం కలిగింది.

కనకం—అందరితోనూ చెప్తుందేమో ? చెప్పనని ఒట్టేసింది; నేనుకూడా ఒట్టేశాను. నా ఒట్టుకున్న విలువే కనకం ఒట్టుకుకూడా వుంటే—నా పునాదికే ముప్పం వొస్తుంది; కాని స్త్రీలఒట్లకూ నా పూర్వానుభవంవల్ల గ్రహించిన కనకం ఒట్లకూ—పురుషుల ఒట్లకన్న

పట్టించెక్కువని తెలుసు. ఎల్లాగైనా ఆమె తన మాటమీద నిలబడు తుందనే ధైర్యం మాత్రం వుంది.

ఇంక కనకం ఇంటికీ, ఆమెకూ కూడా నీళ్ళధారే! దేవుడు నా కా పాడుబుద్ధి ఎందుకు పుట్టించాలి? నేను ఏ ఆలోచనా లేకుండా, అసలు యీ బుర్రనే ఉపయోగించుకోకుండా—ఏదో చెప్పలేనిశక్తికి బద్ధుణ్ణై ఎందుకు ఆ వెధవపని చెయ్యాలి? కనకం దృష్టిలో నాకున్న గౌరవానికి నా సహాధ్యాయులు నామీద ఈర్ష్యపడుతూ, చూచే కొరకొర చూపులు నాకు తెలియకపోతేగా? అదంతా ఇకముందెందు కుంటుంది? జీవితంలో అసాధారణ అమూల్యమైన వస్తువునే పోగొ ట్టుకొన్నట్టూ, తిరిగి మళ్ళా దాన్ని సంపాయించలేననే నిరాశతో ఆరాత్రంతా వేగిపోయ్యాను.

కనకం యింత శీలవతా? శీలవతిని చెరపబోయిన కీచకుడు జ్ఞాప కానికొచ్చాడు. వాడికీ నాకూ ఒక్కటేభేదం. వాడికి చావు; నాకు చావుతప్పి కన్నులొట్టాను! ఎంత దుర్దినం! ఎంత తప్పూ, పాపమూ మూటకట్టాను!

కనకం! ఏం—అదిమాత్రంమనిషి కాదూ? నేను తనను ప్రేమిస్తున్నట్టు చెప్పేప్పటికే అంత కోపం రావాలా? అబల అనే స్త్రీ చేతిలో... నా చెంప తబలమోత మోగాలా? దాన్ని సాధించాలి! నా జీవితం లో దాన్ని నా పాదాల కిందికి రానిచ్చి నల్చి పారెయ్యాలి; ఒక సమయం రాకపోదు—అప్పుడు తెలుస్తుంది దాని పని! ఇంకా దాని ఇంటికా వెళ్ళటం! నాకు రోషంలేదూ? పౌరుషం లేదూ? తోక తొక్కిన పాము వొదులుతుందా? ఒక్క కోరల్లో మాత్రమే విషాన్ని పెట్టుకొని కరవటం వొక్కటే చేతనైన పామే వదలనప్పుడు— ఒళ్ళంతా విషం చేసుకొని తీరని పగపట్టిన మానవుడు—వదలటమే! ఈ లోకమూ, మనుషులూ, సంఘమూ, ప్రభుత్వమూ—ఎవ్వరూ అడ్డురాకుండావుంటే ఈ క్షణంలో దాని పీక పిసికెయ్యనూ. సమ్మో హనాస్త్రం లాటిది ఇప్పుడు నా చేతులోవుంటే ఎంత ఉపయోగ

పడేది! ఎంత అనురాగాన్ని చూపాను; నా విజ్ఞానమూ, వ్యక్తిత్వమూ ఆమె ముందు దమ్మిడీకి. రోలీకి పనికిరాలేదు! ద్రౌపది మయసభలో సుయోధనుణ్ని చూసి నవ్వినంత మాత్రాన ఎల్లాటి పరాభవానికి గురైంది ఒక్క 'నవ్వు' అంతపని చేసింది, నన్నో—కొట్టింది; ఇప్పుడు నేను సుయోధనుణ్ణయి, అది ద్రౌపదయితే—చిత్రవధను ఆజ్ఞాపించనూ? చూడ లేక పోతానా—ఆమె పతనాన్ని?

అత్యధిక కోపంతో శరీరంలోని రక్తమంతా ఉప్పొంగింది; కాని ఆ చాతకానికోపం నన్ను ఏడిపించేందుకు తప్ప ఇంకెందుకూ పనికి రాలేదు!'

ఈ విద్యార్థులు...ఒట్టినాపలు! ఏమీ తెలీని వెధవలు! ఒక పుష్పం వుంటే—మధువుకోసం ఎన్ని తుమ్మెదలు జేరుతై! అంతే!—గొర్రె పొట్టేలు బుర్రకాయ వేసుకొని—అందరూ ఆమె కొంగు పట్టుకు వెళ్లాడాలనే—వీలైతే ఆమెను అనుభవించాలనే ఆశ! కాని, వీళ్ళల్లో ఒక్కళ్ళకైనా ఆమె చేతిబలం తెలుసా? పురుగు దీపం దగ్గర కెళ్ళి రెక్కలు కాల్చుకునేదాకా—తెలుస్తుందా అపాయమన్న సంగతి? ఆమెను వెంటాడి తమజీవితాన్నీ, చదువునూ, ఆరోగ్యాన్నీ—అన్నిటి కన్నా విలువైన కాలాన్నీ పాడుచేసుకుంటేనే కాని నిద్దర పట్టదు! వాళ్ళకూ తెలుసు—మనం వ్యర్థప్రయత్నాలు చేస్తున్నామని. కాని వాళ్ళ హృదాయాల్లో దాగివున్న 'ఆశ' వుండే అది ముందుకు నెట్టి మోసంచేసేదాకా తెలిసిరాదు. ఆమె దృష్టిలో అధికులుగా కన్పించేం దుకు ఎన్ని ప్రయత్నాలు! ఎప్పుడో ఒకనాడు—వాళ్ళ కోరే ఆనం దం లభిస్తుందనే! "ఆమె ప్రసన్నత దేవీ ప్రసన్నతరా అన్నల్లారా! ఇది స్వానుభవం—కాచి వడబోసిన సత్యం! వెళ్ళారా—నాకు పాత స్నేహితుడనే మొగమాటంవల్ల ఒక దెబ్బతోనే సరిపోయింది! మీకైతేనా—వీపు విమానంమీఠ మోగి కొత్తగా ఆ సమప్రదేశంమీద ఒక డెక్కన్ పీఠభూమి సృష్టింపబడాల్సిందే!" వాలో నేను గట్టిగా అను కున్న యీ మాటలు ఎవరికి విన్పిస్తాయి?

ఒకవేళ ఇదంతా చెప్పినా, "నీ మొహం! నిన్ను కాబట్టి అల్లా తోసేసింది; నేనైతేనా—అసలు దానికి కొన్ని ఫక్కీలున్నాయోయ్—ఫక్కీలు! కామశాస్త్రంకిందినుంచి పైకి అప్పగించేప్రావీణ్యతా, థియరిటికల్ గాను, ప్రాక్టికల్ గానుకూడా అత్యంతానుభవమూ—ఇమిడివున్నాయ్—యీ బుల్లి బుర్రలో! నీమాత్రం చనువు నాకు వుంటేనా—ఎప్పుడో కనకం నాదయిపోయేది—" అంటారు—ఏ నది ఎల్లా తిరిగినా చివరికి సముద్రంలోకే వెళ్తుందనే సంగతి తెలీని—పిచ్చివాళ్ళు!

ఇంతమంది శునకాల్లాగు తన చుట్టూ తిరుగుతున్నారనే గర్వం ఆమెకు! వీళ్ళందరిచేతా తనచుట్టూ ప్రదక్షిణాలు చేయించుకొని, తన కావాల్సిన పనుల్ని సక్రమంగా చేయించుకొని, చివరకు 'దక్షిణ' కింద వాళ్ళను మసిపూసి మారేడు కాయల్ని చెయ్యటం ఆమెకొక సరదా కాబోలు! నాలాగు ఎంతమంది విద్యార్థులు—పడుకొని నిద్ర పట్టక—ఊహా ప్రపంచంలో కనకంతో సరస సల్లాపాలాడుతూ—ఈ జన్మకు ఇంతేనన్నట్టు—ఉసూరుమనుకుంటూ మనోవేదన పడుతున్నారో! అద్దె సైకిళ్ళు తీసుకొని ఆమె దృష్టిని ఆకర్షించేందుకు గంటను బలంకొద్దీ దబాయించి కొట్టుకుంటూ—పిల్లలకోసం ఆంజనేయస్వామికి ప్రదక్షిణలు చేసే ముత్తైదువకన్నా భక్తితో ఆమె ఇంటిచుట్టూ తిరుగుతూ—ఈ కాకి మూకలకు అక్కడో ట్రాఫిక్ కంట్రోల్ అవసరమనిపించేట్టు చేసే శక్తి ఆమెలో వుంది కాబోలు! ఇదంతా ఆమె సౌందర్యం మహాత్మ్యమే! సౌందర్యం అరుదైంది కాబట్టే—దానికా విలువ. బంగారమూ, రత్నపురాళ్ళూ అరుదుగా దొరకటం మూలానే—దానికా విలువ! బంగారంకూడా ఇనుములాగు దొరకటం ఆరంభిస్తే ఎవరికొవాలి "వెధవ బంగారం!" ఈ అరుదైన వస్తువులూ—మనకు అందుబాటులో లేని వాటికోసమే—యీ పాకులాటా—పీకులాటాను! ఈ గడిబిడిలో ఉన్నవాటిని కూడా జారవిడుచుకోవటమూ; చివరకు ఉభయభ్రష్టుత్వమూ—

ఉపరి పన్యాసమూను!

ఆమెకోసం కొట్టుకుచచ్చే వీళ్ళందరకూ నాలాగే దెబ్బ తగిల్నట్ట యితే —నాలాగే వేడినీళ్ళకాపు పెట్టుకున్నట్టయితే—బాగా తెలి సేది—వాళ్ళతలలు పులినోట్లో పెట్టి గంతులువేస్తున్నట్టు! రొమాన్స్ అంటే అంత తేలికనుకుంటారు కాబోలు!

ఇలాటి భావాల్లోనే మరి నాలుగురోజులు స్కూలుమాని కూర్చొని గడిపా. మనస్సు మనస్సులో ఉండక, ఏదో దిగులుగా వుండేది. నాకు నేను ఎంత వేదాంతాన్ని బోధించుకొన్నా, కనకంమీద ఎంత కోపం వొచ్చినా—ఆమె నాకు కావాలనే కోరిక మాత్రం నన్ను వదలటంలేదు. అంతకంతకు దూరమైనకొద్దీ ఇంకా ప్రయత్నించాలనే! చచ్చిపొయ్యేవాణ్ణికూడా పట్టి బలవంతాన బతికిద్దామని తమకు తెలి సిన మందులూ మాకులూ వాడేదాకన్నూ—రోగి చనిపోయినా తమ మాత్ర ఎల్లాగైనా మింగుడుపడితే పోయినప్రాణం తిరిగి రావొచ్చని భ్రమపడే వైద్యులూ—నాబోటివాళ్ళే కాబోలు!

ఈ నాల్గురోజులూ తన స్వాస్థ్యాన్ని కోల్పోయిన లోభిలాగు, మనస్సు ఆందోళన పడసాగింది. చదువులోనూ, ఇతర కాలకృత్యా ల్లోనూ శ్రద్ధ క్షీణించింది. నాలోని ప్రతిభ శక్తినీ ఆకర్షించుకొని, దాన్ని లాగేసుకొని, నన్నుమాత్రం యీ బొందిలోని ప్రాణితో ఎందుకూ పనికిరానివాణ్ణిగాచేసి వొదిలేసింది—కనకమేనని నాకు తెలియపోలేదు! చెట్టుమీద కూర్చొని అరిచే పక్షులూ, వీచే గాలికెరటాలు అంటిపెట్టుకు కూర్చోవాలని చేసే వ్యర్థప్రయత్నమూ—నాలాగే మథనపడుతూన్నట్టు తోచేది. లోకమంతా కనకం మయంగా మారినట్టూ, ఆమె నా కళ్ళల్లో మసులుతూ, నాకుమాత్రం అందకుండా దూరదూరంగా పరుగెత్తి నన్ను చూచి వెక్కిరించి వేళాకోళం చేస్తున్నట్టూ స్ఫురించింది.

అసలు నేను ఆమెను ఎందుకు ప్రేమించాలి? ఎందుకేమిటి? ప్రేమకు కారణాలేమిటి? సూర్యరశ్మికి మంచెందుకు కరుగుతోంది! ఇనుమును సూదంటురాయి ఎందుకు ఆకర్షిస్తోంది? అల్లాగే నాక్కూడా

ఏకారణాలూ కన్పించలేదు.

ఎంత మనోవేదనకు గురయ్యానో కాని, నాలో పూర్వంవున్న ఉత్సాహం పూర్తిగానశించింది. జాలిగొలిపే దృక్కుల్తో ప్రతిదాన్నీ చూస్తూండేవాణ్ణి. విన్నదీ, కన్నదీ, సొంతందీ అనేకరకాల, వేదాంతంతో నాకు నేను సమాధానం చెప్పుకొన్నా, కాని తృప్తిలేదు. కనకంతోనే నా జీవితంసరా? ఇలాగే కాలం గడిచిపోకపోతుందా—?

కనకమంటే విరక్తి కల్గించుకొన్న నేను—ఇంత వేదాంతాన్నీ బోధించుకొన్న నేను—ఆమెవైపు పరుగెత్తే మనస్సును పట్టలేకనే పోయ్యాను! ఎవరికైనా చెప్పటం ఎంతతేలిక! మూగవాడు కాకుండా వుంటే చాలు! నాకు నేను చెప్పుకున్నాకాని, నన్ను నేనే నమ్మలేకుండా వున్నా. ఈ తెలిసిన వేదాంతాన్నీ, ధర్మాల్నీ, న్యాయాల్నీ, ఆచరణలో పెట్టగలుగుతే—ఇప్పటికి లోకంలో చాలామంది 'నిజమైన వేదాంతులు' తయారయ్యేవారు!

## 4

క్లాసులో కూర్చొని పాఠంవింటున్నా. నన్నమాటే కాని—ఒక్క ముక్కకూడా నా చెవిన పడక, అంతా అగమ్య గోచరంగా వుంది. కనకాన్ని చూస్తూన్నంతసేపూ మనశ్శాంతి వుండదు; ఒకసారి కరిచి—చావు తప్పి కన్ను లొట్టపడేట్టు చేసిన పాము ఎదురుగుండా కన్పిస్తూంటే ఎల్లా వుంటుందో నాకప్పుడు బాగా అర్థమైంది. ఎంత కోపం వొస్తోందో, అదంతా ఎందుకూ పనికిరానిదీ, సాధించలేనిదీ, చాతకానిదీ అవటంచేత ఒకవిధమైన తపన! శృంగ భంగాన్ని సహించలేని—భగ్నహృదయం!

“అట్లా వున్నావేం?” అని “కనకానికీ మనవాడికీ చెడినట్లుంది” అనీ, “ఆ చెంపమీద ఏమిటోయ్? కనకం ముద్దరెయ్యలేదుకద?”

అనీ—దోమలు ముసిరినట్టూ, కందిరీగలు సంగీతాన్ని సాగించినట్టూ—సహాధ్యాయుల ప్రశ్నాపరంపరలు; ఒక విధమైన విసుగూ, కోపమూ వాళ్ళమీద! ఏవో కుంటిగుడ్డి సమాధానాలు చెప్తూ ఎల్లాగో వాళ్ళ గోల వదిలించుకున్నా, ఛస్తామన్నా మనను వదలని లోకం—ఒంటరిగా వొదిలిపెట్టమని సాష్టాంగ దండప్రణామాలు చేసినా వెంటపడే లోకం! దీన్ని వొదిలించుకునేందుకు తాతలూ, ముత్తాతలూ దిగిరావాలి!

స్కూలు వొదిలాక మెల్లిగా ఇంటికి బైలుదేరా. రోడ్డు మధ్యగా తలెత్తుకు తిరిగే రోజులు వెనకనే గడిచిపోయినట్టు—పక్కగా, మెల్లిగా తలవాల్చి నడుస్తున్నా. వెనకటి విషయాలు జ్ఞాపకానికి రావటం, దుఃఖంతో, విచారంతో నిండినగుండె, ఇలా అయిపొయ్యా నేనూ అని నామీద నాకు కలిగే జాలీ—అన్నీ కలిసి కళ్ళనీళ్ళు తెప్పిస్తున్నాయి. రోడ్డుమీద ఏడుస్తే దారే పొయ్యే వాళ్ళు చూసి నవ్వుతారనీ, నన్నొక పిచ్చివాడుగా జమకడుతారనే అభిమానం; నాకు తెలుసు—ఇంట్లో గదిలో ఏకాంతంగా కూర్చొని గుండెలో పొంగి పొరలే దుఃఖమంతా కన్నీటి రూపంలో బైటపడేట్టు చెయ్యాలని; ప్రకృతిలోనూ, జీవితంలోనూ—సౌందర్యమూ, సౌఖ్యమూ వున్నా—యీ స్థితిలో వున్న వాడికేం తెలుస్తాయి!

లోకమంతా నాలాగే ఇల్లాటి స్త్రీని గూర్చిన సమస్యల్లో వేగిపోతోందా? చీకటిపడటం ఆలస్యంగా గొంతుకుదాకా తిని తేపుకుంటూ, వెల్లకిలాపడుకొని రెండు చేతుల్నీ గుండెమీద వేసుకొని, కమ్మటి కలల్నికంటూ గురకలుపెట్టి నిద్రపొయ్యే వాళ్ళందరకూ ఇల్లాటి అనుభవాలు లేవా! ఉన్నా—అన్నింటినీ మరిచిపోయి, వైరాగ్యంలో పడివున్నారా! వైరాగ్యం! కిందటి క్షణానవున్న వైరాగ్యం—ఈ క్షణాన మాయమౌతుంది. ఎల్లా, ఏ తపస్సుచే ఏ జపాలుచేసి సాధించారు దీన్ని!

నా వెనక సన్నని కంఠంతో, "రా—జా!" అని వినిపించి

ఐదురోజుల క్రితం విన్న గొంతది! మళ్ళీ వెంటపడుతోందా! ఇంకా నన్ను ఏడిపించాలా? నాలాటివాళ్ళందరూ ఏడుస్తూంటే—తను నవ్వుతూ—మా అందరికన్నా తనే ఆనందమయజీవితాన్ని గడుపుతూన్నట్టు డబ్బా వాయించుకుంటేనే కాని ఆమెకు తృప్తిలేదా!

ఆగా—తలవొంచుకొనే వున్నా. ఆమె చూస్తూండగా ఆమెవైపు చూడకూడదనే పట్టుదలతో!

"మా ఇంటికి ఒకసారి వొస్తావా?"

"ఎందుకూ?"

ఆగి మాట్లాడుదామని వున్నా—ఆమెకు సమీపంలో వుండి మాట్లాడేశక్తిని కోల్పోయిన శరీరాన్ని మోసుకుపోతున్నై—నా కాళ్ళు.

"నీతో కొంచెం మాట్లాడాలి—"

నేను ఊహించుకోగలను ఆమె మాట్లాడేది! ఒక చిన్న తప్పు చేస్తే దాన్ని సాగతీసి సాగతీసి ఆడగటమూ—ఒక చిన్న నేరానికి వాయిదాలు వేసి, బోనులో నిలబెట్టి ప్రశ్నపరంపరలు కురిపిస్తూ క్రాస్ ఎగ్జామినేషన్లు చేసి పీక్కుతినే ప్లీడర్లు—జ్ఞాపకానికొచ్చాయి. ఆమె చెప్పే వేదాంత రహస్యాలూ, నీతులూ, నియమాలూ—నన్నింకా కుంగదీసి ఆత్మహత్య చేస్తాయి! నన్నింత మాత్రం జీవచ్ఛవంగానే వదలకూడదూ?

"మాట్లాడవేం?"—పూర్వంలా అధికారం లేదు ఆ మాటల్లో, మృదుత్వమూ, జాలీ, దీనతా మిళితమై వున్నై.

"రా—ను" ఇంకా ఎందుకు రానో, ఎందుకు రాదల్చుకో లేదో—కారణాలు ఏకరువు పెట్టేందుకు అది రోడ్డు; వచ్చే పొయ్యే వాళ్లు—ఇంత చక్కని అమ్మాయితో మాట్లాడే అవకాశం దొరికిన నా పు ఈర్ష్యగా చూస్తున్నారు; వాళ్ళకు లేనిదాన్ని—దేన్నో నేను టకట్టుకొని వాళ్ళను అన్యాయం చేస్తున్నట్టు 'జలసీ' చూపులు! ారమనే తీక్షణదృష్టి బాణాలు! వాటికి పదునువుంటే రోజూ సార్లు నేను చస్తూవుందును! ఏమైనా నాకు కలిగిన పరాభవం—

వాళ్ళకు లేదని సంతోషపడకు—బహుశా అది తెలియకేమో! నేనొ క్కణ్ణే అదృష్టవంతుణ్ణను కొనేవాళ్ళు—నా దృష్టిలో ప్రతివాడూ నాకన్న అదృష్టవంతుడే!

"ఒక్కసారి—రా—రాజూ! ఒక్కమాట—చాలా అవసర మైంది—మాట్లాడాలి." ఏదో ప్రాధేయపడుతూన్నట్టుగా మాట్లాడు తోంది; నమ్మివెళ్ళనా? మళ్ళా ఉరితాటిని మెళ్ళోవేసుకోనా? 'అవసరమైన పని'—తనకు అవసరం.—నాకు అనవసరమేమో!

నా మౌనాన్ని వెక్కిరిస్తూ అంది; "నీ తెలుగు టెక్స్ట్ మరిచిపో య్యావ్—తీసుకువెళ్ళుదూ కాని." ఇదొక ఆశా? ఏదో సాకుచెప్పి, నాలుగు చివాట్లుతిని—మళ్లీ కొత్తదన్నా కొనుక్కుంటూ. మనం సాధించగలవాటినీ, కొద్ది కష్టంతో అందుబాటులో వున్నవాటినీ ఆశలుకింద 'ఎర'లుగా చెలామణిచేసి—అంతమాత్రానే మోసం చెయ్యొ చ్చనుకునే పిచ్చిపిల్ల!

మళ్లీ నా నిశ్శబ్దతను చీల్చుతూ అంది; "మాఅమ్మ రమ్మంది—"

చచ్చాం—అమ్మతో కాని చెప్పలేదుకద? ఈనాటి పరిస్థితుల్ని బట్టి చూస్తే ఎవరికీ తెలియలేదనే ధైర్యం వొచ్చింది. కొంపదీసి—నన్ను భయపెట్టాలని చూస్తోందా?

"ఎందుకూ?"

"ఏమో! నాకు తెలీదు—ఒక్కసారి—రా"

"మీ అమ్మతో చెప్పావా!"

"ఊహు"—తలవూపినప్పుడు సూర్యుడు ప్రతిఫలించే లోలక్కులు కదలక ఎంత బావుంది!

"పోనీలే—నేను రాను."

"ఇంతేనా—రాజూ!" బెదిరిస్తోందా? లేక బతిమాలించుకో వాలని నాకు వుందా! 'ఇంతేనా!' ఇంతిగాక ఇంకేమిటి? మా స్నేహం రోజుల క్రితమే పోయిందనుకున్న నన్ను ఇంకేం చేస్తుంది?

"రాజూ—బతిమాలాలా?"

రోడ్డుమీద బతిమాలటం మొదలు పెడుతుందేమోననే భయం! ఇంతసేపూ మెల్లిగా మాట్లాడుతూ—జనసమ్మర్దంలోని సందుల్లోపడి నడుస్తున్నా—దూరదూరాననక్క దిష్టికొట్టే కళ్ళతో మమ్మల్ని చూస్తున్న కుర్రకుంకల కళ్లు—నేను దీన్ని గమనించకపోలేదు. ఆల నాడు యముడి వెంటపడ్డ సావిత్రి జ్ఞాపకానికొస్తోంది; స్త్రీలకు ఇంత పట్టుదలా అనిపిస్తోంది.

"నన్నెవరూ బతిమాలక్కర్లేదు—"

"మరి వొస్తావా?"

నాలోని ఏదో శక్తి నాచేత 'సరే' ననిపించాలని చూస్తోంది.

"ఒక్కసారే—"

"సరే-లే!"

"ఎప్పుడు?"

"రే-పు"

ఈనాటికి తప్పుకుంటే రేపటి సంగతి చూచుకోవొచ్చనే యావలో వున్నా.

ఇద్దరమూ చీలిపోవాల్సిన రోడ్డొచ్చింది.

"కాదు—ఇప్పుడే!—ఇప్పుడు నీకేం పని వుంది? నాతో రా."

కొళ్ళాలనే వుంది. వెళ్తే చెప్పుతుందా? ఆమె కళ్ళల్లోంచి చూచాయిగా ఆమె హృదయం కన్పిస్తోంది, ఎరుపుదనంలేని ఆ కళ్లు కోపాన్ని కోల్పోయ్యాయి. ఇన్నాళ్ళూ వాళ్ళింటికి వెళ్తూంటే కొట్టిందా? పిచ్చివేషం వెయ్యబట్టి కొట్టింది! ఇంక ఆ వేషం వెయ్యకుండా వుంటే సరి. ఏమన్నా అననీ. వెళ్దామనే నిశ్చయాని కొన్నాను.

"ఏం?" అంది నాచేత మట్లాడించాలని కాబోలు!

"నువ్వో పో—నేను వెనకాలవస్తా."

"ఇంటికి వెళ్తావా?"

"వెళ్ళి ఇప్పుడే వస్తాగా!" వెళ్తే రానని ఆమె అనుకొని

వుంటుంది. నామీదా నా మాటమీదా ఆమె విశ్వాసం అనాడే పోయిందేమో!

"నీకు ఇంటిపట్టున ముట్టాల్సిన కాఫీ—నే నిస్తానుగా!" తప్పని సరయింది. ఈ ఒక్కసారీ వెళ్ళి చూద్దామనుకొని—మంత్రముగ్ధుడిలాగు వెంటపడ్డాను.

స్నానంచేసి మడికట్టుకోబోతున్న ఆమె తల్లి నన్ను చూసి, "ఏం నాయనా రావటంలేదేం?" అంది.

"ఒంట్లో బాగా లేదండీ—" నేను బొంకినట్టు కనకాని కొక్క తెక్కే తెలిసినట్టు—ఆమె నన్ను చూసి నవ్వింది.

మెల్లిగా మేడమీదికి తీసుకువెళ్ళి "ఇక్కడ కూర్చో—ఇప్పుడే వస్తా" అంటూ చరచరా దిగిపోయింది. ఎవళ్ళన్నా పిల్చుకు వస్తుందా? రానీ—అంత నెత్తిమీదికే వస్తే భరించి తీరవలసిందేగా!

తెలుగు టెక్స్ట్ తీశా. పోయిందనుకొని నిరాశ చేసుకున్న పుస్తకం—దొరికింది! మొదటి పేజీలోనే ఏవో రెండు పంక్తులు రాసివుంది. ఆ వొంకర టింకర అక్షరాలు కనకానివని తెలుసు.

"కనకపు సింహాసనమున
శునకము కూర్చుండబెట్టిన—
........................."

సుమతీశతకంలోది! ఎందుకు రాసింది? ఆలోచించా. కనకం—తనన్న మాట! నేనో శునకాన్నా? 'రాజు' నా పేరు తీసుకొని—నన్ను సింహాసనంమీద కూర్చోబెట్టటమా? ఇదే పద్యభాగాన్ని సన్నని గొంతుకతో శ్రావ్యంగా పాడుకుంటూ ప్రవేశిస్తోంది—రంగస్థలంమీదికి వొచ్చే నటకురాలిలాగు! కనకంలో ఎంత హాస్యం వుంది!

రెండు కప్పుల్తోనూ కాఫీ తెచ్చింది; మొగమాటానికి నా భాగం కింద ఒకదాన్ని ఖాళీ చేశా.

"ఏమిటా పద్యం!"

"చిన్నప్పుడు చదువుకోలా!"

"ఏమిటి—నా పుస్తకంమీద రాశావు? నువ్వు కనకానివీ, నేను శునకాన్నీనా?"

నవ్వుతూ, "ఛా! అలా అని ఎవరు చెప్పారు!" అంది.

"మరి ఏమిటా అర్థం?"

"అదే కాని—నువ్వు కాదు—"

"శునకాన్నా!"

"ఊఁ. వీళ్ళందరూ—కనకం—కనకం—అని వెంటపడే వీళ్ళందర్నూ—శునకాలు—"

"మరి నా పుస్తకంమీదెందుకు రాశావు? వాళ్ళ పుస్తకాలమీదనే రాయలేక పొయ్యావూ?"

"వాళ్ళందరకూ చూపు—బుద్ధొస్తుంది." ముందు నాకు బుద్ధి చెప్పి—దాన్ని ఇతర్లకందరికీ ప్రచారం చెయ్యాలని పూనుకుందా?

మళ్ళీ కొంచెం కొంచెంగా ప్రసంగంలో సరసం ఇముడుతోంది. పూర్వంలాగే వొస్తే మళ్ళీ నేను ఇబ్బందిలో ఇరుక్కోవాలి కాబోలు!

"ఇదేనా నాతో మాట్లాడాల్సింది!" అదేదో కచ్చితంగా తేల్చుకొని, తొందరగా ముగిస్తే నా బాధ్యత తీరుతుందనుకుంటున్నా.

ఆమె కొంచెం ఆలోచించి, నాకు దగ్గరగా జరిగి, ఆ పెద్ద కనురెప్పల్ని వాల్చి మొదలు పెట్టింది; "ఇంత పిచ్చివాడివనుకోలేదు—రాజా! నేనంటే నీకంత కోపమెందుకు! ఒళ్ళు తెలీని కోపంలో కొట్టాననుకో—అయితే మాత్రం ఇంత పగా? ఈ ఐదురోజుల్నించీ పిచ్చెత్తినట్టుంది. నువ్వు లేకపోతే జీవితంలో ఏదో లోపం కన్పిస్తూంటోంది. నిన్ను కష్టపెడదామనీ, నీకు నొప్పి కల్గించాలనీ నాకులేదు. నువ్వు వెళ్ళాక నేను పడ్డ ఆవేదన తెలుసా! ఎందుకు ఆ అపనమ్మకపు చూపు చూస్తావ్? నేను చెప్పేది నిజంసుమా!" నన్ను లాలిస్తోందా? మళ్ళీ తనదగ్గరకు లాక్కోనేందుకు ఎత్తా ఇది? సూక్తులు బట్టలోపాటు గానే కోపపు దుస్తుల్నివొంకెన తగిలించి వొచ్చిందా!

"జరిగిందానికి నన్ను క్షమించు రాజూ! ఎంత దుఃఖపడ్డావు! నీ దుఃఖాన్నీ, నీ జాలిచూపుల్నీ తలుచుకొని నేనూ ఏడ్చాను. అమాంతం లేచి నీ పాదాలమీద వాలుదామనిపించింది. వీళ్ళెవరూ అడ్డురాకపోతే ఏంచేసేదాన్నో! ఇవిగో—ఈ చేతుల్తోనేగా నేను కొట్టింది—వీటిని ఏమైనా చేసుకో—నీ ఇష్టం—" కమనీయమైన గాజుల శబ్దంలో ఆమె కోమల హస్తాలు నావైపు జాపుకున్నాయ్. సహారా ఎడారిలోని మండుటెండను తల్లడిల్లుతూ, ఎండ మావుల్ని చూసి భ్రమిస్తూ దాహానికి పీకారిచ్చుకుపోయిన పాంథుడు—ఒయాసిస్ దగ్గరకు జేరినప్పటికు పొందేలాటి సంతోషంతో నాహృదయం నిండింది. కనకం ఇంత మంచిదా? పశ్చాత్తాప పడ్డదా? ఆమె కళ్ళల్లోని కాంతి—అది నిరాశలో ఆశను చూపే వెలుగా? నేనంటే దయా? జాలా? అందమైన వాణ్నా? కనకానికి నచ్చానా? నేను ఆమెను కోరినట్టే—నన్ను కూడా ఆమె కోరిందా? మళ్లీ ఇదంతా బూటకపు మాటల్తో ఆడే నాటకానికి ప్రస్తావనా? అప్పుడేమైంది యీ ఆదరణంతాను? అది ఒక్కొక్క mood లో మాత్రమే పని చేస్తుందా?

నా కోపమంతా ఎక్కడికి పోయిందో కాని ఆమె మెత్తని హస్తాన్ని పట్టుకొని ఎర్రని వేళ్ళను ముద్దుపెట్టుకున్నా. ఆమె మాట్లాడకుండా నా తృప్తికోసమే కనిపెట్టుకు కూర్చున్నట్టు ఆ కళ్ళల్లోనే దాన్ని కన్పించేట్టు చేసింది.

"రాజూ......ప్రేమ అన్నావే! జ్ఞాపకం వుందా! నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా!" ఆమాట వినటమూ, కథల్లో చదవటమే కాని దాని ఇతర వివరాలు నాకు తెలీవు. ఆ తెలియనిదాన్ని గూర్చి ఆమెకేం చెప్పేది!

"నాకు తెలీదు—" మాట్లాడకుండా గంభీరంగా లొంగిపోవటమే మంచిదనిపించింది.

"పోనీలే—పిచ్చినాన్నా రాత్రికి వొస్తావా!"

"నేనా! ఇక్కడికా? అర్ధరాత్రా! ఎందుకూ!"

వెన్నెలచిలికే చిరునవ్వు నవ్వి అంది; "ఎందుకూ! మొన్న నన్నెం దుకు ముద్దుపెట్టుకున్నావ్! నీలో ఆశలేదూ? నన్ను నువ్వు కోరటంలా! నిజం చెప్పూ—నేను నీదాన్నైపోవాలని—ఆకలి బాధతో అవలించే సింహంలాటి నీ చూపులు చెప్పటంలా? చెప్పూ—వస్తావా!" ఆమె హృదయం ఇంత విశాలమైనదా? ఇంత మృదువైనదా! లేక నేను ఏడ్చిపోతానని, నేను కోరిన సౌఖ్యాన్నిచ్చి, నానుంచి ప్రతిఫలం పొందాలనా!

"రాత్రికి తప్పకుండా రా—మొన్నటిలాగు ఒక్కేసి పారిపో తావా? నన్ను చంపుకున్నట్టే! నీ మాటల్లాగే నా మాటలకూ—డా ఏ విలువా ఇవ్వనట్టయితే!—ఇస్తావా? ఇవ్వను—నీకోసం ప్రాణ మిస్తా. స్కూల్లో అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా? నీకూ, నాకూ ఏదో వాళ్ళకు మాత్రమే అర్థమైన సంబంధం వుందని! మొన్న బోర్డుమీద ఏం రాశారో తెలుసా? "రాజూ+కనకం—!" అని వుంది. (a+b) కీ, abకీ. తేడా తెలీనివెధవలు! ఒకళ్ళు శాస్త్రసుఖంగా స్నేహంగా, కట్టుకథల్ని అల్లి ప్రచారం చెయ్యటమే పనిగా వుంచే పెట్టుకునే విద్యార్థులు! పడ్డపుకారు ఎట్లాగూ పడ్డది. పోనీ వాళ్ళ అపోహల్నే—తప్పైన వాటిని రైటుచేసి చూపిద్దాం......నిరాశ పడ్డావు కదూ? నువ్వుకోరే ఆనందం నాదగ్గరుంటే—తీసుకో—తృప్తిపడు—కళ్ళనీళ్ళు పెడతావ్ దేనికి!"

ఏమో దేనికో నాకే తెలీదు. ఆమె చిరుపెదవుల్ని తోసుకొ చ్చాయా—ఈ సానుభూతి మృదుమధుర వాక్యాలు? ఆమె తనంత తానే నాకు వశమైందా! ఎంత గర్వంగా వుంది! కొన్నివం దలమంది విద్యార్థులకు అందకుండా కూర్చున్న కనకాన్ని గెల్చేశా! లోకమంతా ఏకమై నన్నొక్కణ్ణీ వేరుచేస్తే మాత్రం—కనకం నాకు అండై నిలబడితే—చాలు! అసలు—ఈమాత్రం మాటచాలు!

కన్నీటిని పమిట చెరగుతో తుడుస్తూ, "చూడు—ముఖమంతా వాడి పోయింది. నాగూర్చి కృంగి, కృశించిపొయ్యావా? నిన్ను బాధ

పెట్టే శక్తి నాలో వుందా? రాత్రికి వొస్తావ్ కదూ? ఇంకా చాలా సంగతులు మాట్లాడాలి. ఒంటిగంటకు—తోటలోకి రా—దొడ్డి తలుపు తీసే వుంచుతా. భయపడవొక—నీ ప్రాణానికి నా ప్రాణాన్ని, అడ్డువేస్తా—తప్పకుండా వొస్తావ్ కదూ?" అంది. పోయిన ప్రాణం లేచొచ్చి, పునర్జన్మ ఎత్తినట్టుగా వుంది. నా జీవితంలో ఏదైతే సాధించలేననుకొన్నానో—దాన్నే సాధించా; నిరాశకు తావులేని నా హృదయం—ఆ దుఃఖంలోనే నవ్వింది!

"వస్తావా?" అంది తనూ నవ్వుతూ. ఆ సంతోషంలో మాట రాక, తల వూపా.

"తప్పించుకుంటే—నిన్ను నా జీవితంలో నమ్మను—" వాన చినుకులకోసం కాచుకు కూర్చునే చకోరపక్షి ఆ సమయానికి నిద్ర పోతుందా? కనకంలాటి కనకాంగిని కాల తన్నుకునేందుకు నేనేం అర్జునుణ్ణి, ప్రవరుణ్ణి, భీష్ముణ్ణి కాదుగా!

"నిం—నిజంగా వొస్తా—వెళ్ళానా?"

"ఆఁ. వెళ్ళు—"

వెనక్కి వెనక్కి తిరిగి చూసుకుంటూ—సంతోషంతో ఇంటి ముఖం పట్టా.

# 5

జీవితంలో మొట్టమొదటిసారి చవిచూడబొయ్యే ఆనందాన్ని—అందులోనూ కష్టసాధ్యమనుకొని ఆశలన్నీ వొదిలిన కనకం తనంత తాను ఆహ్వానించి నాకుమాత్రమే ఇవ్వబొయ్యే యీ నూతన హాస్యాన్నూ తల్చుకుంటూ అపరిమితానందాన్ని అనుభవించా. ఎండి మోడైన నా ఆశావృక్షం మరోసారి చిగిర్చింది; కలలోకూడా తలవని విషయం నిజమవబొయ్యే కాలం సమీపిస్తోంది! ఇది తలుచుకుంటూంటే ఒక పిచ్చిశక్తి నాలో పనిచేస్తూ నన్ను నేనే మరిచిపొయ్యేట్టు చేస్తోంది.

ఎంతలో నిరాశ ఆశగానూ, విరక్తి రక్తిగానూ మారుతుందోనని పించింది.

రాత్రి పదకొండు గంటలనుంచే కనకంకోసం వేచికూర్చున్నా. నాకోసమని యీనాడు ప్రత్యేకంగా దేవుడు కాలాన్ని పొడిగిస్తున్నట్టుంది! ఎప్పుడూ 'ఫీ' లవని ఒంటరిపాటును భరించలేనంతగా 'ఫీ' లవుతున్నా.

కనకం వొస్తుందా? ఇంట్లో తల్లి రాహువులాగు అడ్డం పడుతుందా? లేక ఇప్పుడువొచ్చిన పరివర్తనలాంటిదే వొచ్చి ఆమె మనస్సును విరిచి, తిప్పేస్తుందా? చంచలమైన మానవహృదయాన్ని ఎల్లా నమ్మడం? నేనిక్కడ—యీ మంచులో, యీ ఆరుబైట, గస్తీ తిరగటాన్ని చూసి నవ్వుకుందామని ఊహిస్తోందా? మరచిపోయి నిద్రపోతుందా? ఉన్నట్టుండి నాకెదురిపి నన్నిక్కణ్ణుంచి తరిమేస్తుందా? ఎన్ని అయినా అవుతుంది—ఇల్లాంటి నిగూఢ కార్యం!

ఆమె రాంగానే సంభాషించాల్సిన నూతనవిధానాన్నీ, ప్రవర్తనను తల్చుకుంటున్నా; కంటిమీదికి తోసుకొచ్చే నిద్రను పారతోలే పట్టుదలతో అటూ ఇటూ పచారు చెయ్యసాగాను. తాలూకాలో ఒంటిగంట కొట్టిన శబ్దం వినిపడ్డది. పుణ్యకాలం సమీపించిందని ఆతురతతో, ఆశతో—ఆమె ఏటువైపునుంచి నాకోసం పరుగెత్తుకొస్తుందోనని అతిమెలకువగా తీద్రంగా అన్నివైపులా చూడసాగాను. కాస్త చప్పుడైతే భ్రమించి మోసపోసాగాను. నిర్ణీత కాలందాటినప్పటినుంచీ క్షణమొక యుగమైంది, ఆమె అంతులేదు. తిరిగి వెళ్ళిపోనా? ఎంత కష్టించి సంపాయించా ననుకున్నానో అంతా వ్యర్థమేనా? అంతా బూడిదలోపోసిన పన్నీ రేనా! తాలూకాలో పోలీసువాడు నిద్రమత్తులో తిప్పుగంట కొట్టాడా!

తరవాత ఎన్నినిమిషాలు గడిచాయో నాకు తెలీదు. చంద్రుడు మాత్రం పూర్తిగా ఉదయించి, చెట్లకొమ్మల్లోంచి తొంగితొంగి గాఢ సుషుప్తిలో నిమగ్నమైన అతిప్రశాంత ప్రపంచాన్ని చూస్తూ అనంతాకాశ పథంలో ఓర్పుతో మబ్బుల్ని ఎదుర్కొంటూ పశ్చిమ

దిశకు పరుగులెత్తుతున్నాడు. ఇలాటి వెన్నెలరాత్రుల్ని ఇప్పటికి ఎన్నింటిని వృథాచేశాను! ఇది ఆ సంఖ్యకు మరొకటి కలుపుతుందా? దూరాన్నుంచి మెల్లిగా వొస్తోంది. చెట్లు పిల్లగాలికి తలలూపుతున్నై. ఆమె ఆకారాన్ని చూడంగానే నాలోవున్న ప్రతిశక్తీ ఉడకసాగింది. మెల్లిగావొచ్చి దగ్గిరిగా కూర్చుంది. చివరసారి ఆవలింతను బైటికిపంపి "కనకం—" అన్నా మెల్లిగా.

"ఊఁ." అంది; ఇన్నాళ్ళూ లేని సిగ్గు ఏదో ఆమెలో ప్రవేశించి నట్టు సూచిస్తోంది ఆ కంఠస్వరం.

"ఇప్పుడు పన్నెండా—పదకొండా—అయింది?"

"నీకేం మొగనాడివి. ఎప్పుడు పడితే అప్పుడు హాజరవగలవు. నేను అన్ని అడ్డంకుల్నీ తోసుకు రావాలి! ఆలస్యమైందని కోపం వొచ్చిందా?"

ఆ కోపంవొచ్చే క్షణాలన్నీ వెనకనే గడిచిపొయ్యాయని ఆమె కింకా తెలీదు కాబోలు! ఎంత అందంగా వుంది! ఆమె రాచిన వాసన నూనె పరిమళాల్ని గాలిదేవుడు లాక్కుని నాకు దాంట్లో కొద్దిభాగాన్ని ఇచ్చేసి తొందర పని వున్నట్లు పరుగెత్తు తున్నాడు. ఎంత నాజూగ్గా తయారైంది! ఇదంతా నాకోసమేనా? కలా? భ్రమిస్తున్నానా? చెయ్యిజాపి ఆమెను తాకి చూశాను; నవ్వింది. ఆ నవ్వుకు గుంటలు పడ్డ ఆమె చెక్కిళ్ళలో వెన్నెల దాక్కుంటోంది. చెవులను కప్పేసిన జుట్టు చల్లగాలిని పోసుకుంటోంది. ఎంత కష్టపడి సంపాయించాను—ఈ కనకాన్ని! రమ్మనంగానే వస్తూ, పొమ్మనం గానే పోతూ—నోటి మాటల్ని ఆజ్ఞలుగా శిరసావహిస్తూ ప్రాణం వున్న రబ్బరు బొమ్మల్లాగు సంచరించే యీ భార్యల్ని చూసి తృప్తి పడే భర్తలకు తెలుసా అష్టకష్టాలకూ ఓర్చి, నానా అవస్థలూ పడి సంపాయించే ప్రియురాలి కౌగిట్లోని సౌఖ్యం? ఆచారాలకూ, ఆంక్ష లకూ, సంఘానికీ భయపడి ఆశల్నీ, ఆశయాల్నీ, సౌఖ్యాన్నీ చంపు కుంటూ, నలుగురి నోళ్ళా పడకుండా వుండటమే—అర్థమున్నా

లేకున్నా, తృప్తివున్నా లేకున్నా గొర్రెపాట్లేలు బుర్రకాయల్తో అంద ర్నీ అనుసరించటమే—జీవితంలో సాధించేదనుకొని—లోలోపల్నే కుమిలిపోతూన్న పెద్ద మనుష్యులకు అర్థమాతుందా—యీ రకం సౌఖ్యం ? స్వర్గమనీ, నరకమనీ, పాపమనీ, పుణ్యమనీ చెప్పి—భయ పెట్టి—ఒక చట్టానికి బద్ధుల్నిచేసి—మానవుల్ని ఒక మెషీన్‌లాగు పని చేయిస్తూన్న సంఘం! ఎక్కణ్నో స్వర్గం! ఎవరు చూశారు! చూశామని చెప్పినా నిజంగా ఎవరు నమ్ముతారు? నాకు కన్పించే నందనవనం ఆ తోటే! నాకు కావాల్సిన ఊర్వశీ, రంభా, కనకమే! ఇంకెక్కడో నాకు తెలీని స్వర్గం—నాకు దాంతో ఏం పని ?

ఈ లోకాన్నే మరిచిపోయి, వెచ్చని ఆమె హృదయంలో తల దాచుకున్నా. ఒకళ్ళ కొకళ్ళం పూర్తిగా అర్థమైనట్టు ఐక్యమై పోయ్యాం. ఆ మధురతమ క్షణాలు నా ఆనందమయ జీవితానికి నాంది కాబోలు!

ఆమె వొళ్ళో తలపెట్టి పడుకొని చల్లని చందమామనూ, నక్షత్ర సమూహాన్నీ చూస్తూ, "చూడు ఆకాశంలో ఎంత ఆనందంతో తన్మయుడౌతున్నాడో చంద్రుడు—" అన్నా. తిన వేళ్ళను నా క్రాపు లోకి పోనిచ్చి, నవ్వుతూ నా కళ్ళలోకి చూసి అంది : "ఔను, ఆ రాజులాగే యీ రాజు కూడా ఆనందంతో తన్మయుడౌతున్నాడు కదూ?" తెలుగు మాస్టారు 'రాజు' శబ్దానికి చెప్పిన నానార్థాలు జ్ఞాపకమున్నాయన్నమాట!

"కనకం! నా జీవితమే ధన్యమైంది! నిన్నుగూర్చి నిరాశతో, నిస్పృహతో కృంగి కృశించాలేమోననుకున్నా. నా జీవితమంతా ఇలాటి రాత్రులే అయితే—!"

అర్థోక్తిలోనే అందుకొని అంది: "అప్పుడు జీవితం అసలుండదు. వెరైటీలేకపోతే ఎందుకొచ్చిన జీవితం! ఇదివరకులాగే జీవితం గడిచి పోవాలని నువ్వు కోరుకుంటావా ? మొగం మొత్తిపోదూ ? కష్టమూ, సుఖమూ పర్యాయంగా వొస్తూ వుంటేనేగా జీవితనాటకంలోని రుచి

తెలిసేది? ఎప్పుడూ నవ్వుతూనో, ఏడుస్తూనో కళ్ళుమూసుకొని కాలాన్ని గడుపుతూంటే దుర్భరమనిపించదూ?" ఎక్కడ సంపాయించింది యీ అనుభవాన్నీ, వేదాంతాన్నీను!

"చూడు ఆ చంద్రుడెల్లా పరుగెత్తుతున్నాడో! ఎంతసేపని అల్లా వేచి కూర్చుంటాడు? కాలం మనకోసం నిలుస్తుందా? మళ్ళీ తెల్లారుతే ఆ పాడుస్కూలూ, మనుషులూ—అంతా మామూలే! మళ్ళీ కొంతకాలం విడివిడిగా వుండి కలుసుకుంటేనే కాని ఆ ఉద్రేకమూ ప్రత్యేకతా తిరిగిరావు. కథల్లో చదివి కలవరపడ్డంత ఏముంది?" ఆమె ఒళ్ళో తలపెట్టుకు పడుకొని చుక్కల్ని చూస్తున్నా.

"ఇంకా ఎంతకాలం కావాలి నేను!" అంది నాకళ్ళల్లోకిచూస్తూ.

"ఎల్లకాలమూను—"

"పెళ్ళిచేసుకుంటావా?" ఆ వెన్నెలవెలుగులో కలిసిపొయ్యేట్టు నవ్వింది.

పెళ్ళి! లోకంలో అందరూ పెళ్ళిచేసుకుంటున్నట్టూ తెలుసు; భార్యల్తో కాపరాలు చేస్తున్నట్టూ తెలుసు. నేను కనకాన్ని పెళ్లాడటమా? ఆమె నా జీవితమంతా కావాలనివుంది; కాని, ఆమె వితంతువుకాదా? ఆమెను పెళ్లాడుతే వీళ్ళందరూ ఊరుకుంటారా? నాన్న ఇంట్లో వుండనిస్తాడా? అమ్మ కన్నీటితో కృశించదా! సంఘాన్ని దూషించినంత బలంగా ఎదుర్కోలేని అశక్తత నాలో పనిచేసింది. సంఘం! కనకం నాకు కావాలన్నప్పుడూ, ఆమెను జేరేప్పుడూ నాకు పనిలేని సంఘం! కాని యీ వివాహపు విషయం వొచ్చేప్పటికి మళ్ళీ ఆ సంఘానికే భయపడాలా? సమయానుకూలంగా రేట్లు హెచ్చించేందుకూ, తగ్గించేందుకూ ఇదేమన్నా నాటకమా? అసలు ఈ కోర్కెతోనే నన్ను ఆహ్వానించిందా?

"ఇష్టంలేదా?" అంది.

"ఊహుఁ."

"నాకూ్కడా—నిజం."

"మరి అట్లా అడిగావేం?"

"ఊరికనే—"

"రేపుకూడా వస్తావా?"

"రోజూనా?"

"ఆఁ."

క్షీణకాంతుల్తో చంద్రాస్తమయ సమయసూచన కన్పిస్తోంది. అప్పుడే తెల్లారుతోందా? ఈ గడియారాలూ, కోళ్లూ మరికొంచెం సేపు ఆగకూడదా? ఈ మనుషులందరూ ఇంకొంచెం సేపు నిద్ర పోగూడదా! ఇట్లా ఎప్పటికి తృప్తి!

"వెళ్ళనా!—" అంది నా చేతుల్ని తన చేతుల్తో గట్టిగా ఒత్తుతూ. నేనేమి మాట్లాడకుండా మంచుపడి చల్లనైన ఆమె చెక్కిళ్ళకు నా ఉష్ణవాయువుల్తో చలి కాచాను.

"ఇంక వొదులు—రేపురా... అంతా ఇవ్వాళ్టిలాగే—" ఎల్లాగో నన్ను వొదిలి నాలుగు గజాల దూరంలో నిలబడి చెదిరిన ముంగురుల్ని, పమిటనూ, చీరనూ సర్దుకుంటూ నవ్వుతోంది. సమీపించబోయే నన్ను అరిచేత్తో వారించి "ఇంక వెళ్లూ—" అంటోంది.

వెనక్కిలాగే కాళ్ళతో శరీరాన్ని యీడ్చుకుంటూ బైటపడ్డా. కనకంలో వున్న గొప్పతనమంతా అర్థమై పోయినట్టూ, ఆమెను వశం చేసుకున్నాననే గర్వంతో విర్రవీగుతోంది—మనస్సు. గుప్పెట తెరవంగానే బైటపడే గంభీత ఇదే కాబోలు ననుకున్నా. కనకమంటే భయం పూర్తిగా పోయింది. 'ఆమె నాది' అని నాలో నాకే ఎవరో చెప్పసాగారు. ఇదంతా తలుచుకుంటూ కన్నుమూశా.

రాత్రి నిద్రపోకపోవటంవల్ల పొందిన బడలిక నన్ను వేధించింది. క్లాసుకు నాగాపెట్టి స్నేహితుడి గదిలో నిద్రపొయ్యా. ఆ పగలంతా గతరాత్రి రంగాన్ని జ్ఞాపకం చేసుకుంటూనే గడిపా.

# 6

"రాజా! ఎక్కడికైనా పారిపోదామా!" "ఈసంఘాన్నీ, యీ మనుషుల్ని తప్పించుకు పారిపోవటమే! ఈ లోకంలో ఎక్కడ— ఏ మారుమూల వున్నా వేటాడి మృగంలాగు—బతికివున్నా, చచ్చి నాసరే పట్టుకు రారూ! ఇక్కడున్నలాటి మనుషులూ, సంఘమూ—ఆచారాలూ, ఆంక్షలూ, నిర్బంధాలూ ఆ పారిపొయ్యే చోటున మాత్రం లేవూ—ఏ మైదానాల్లోకో, అడవుల్లోకో, ఎడారుల్లోకో నిర్జన ప్రదేశాల్లోకో పారిపోతే తప్ప? పారిపోయి...! అంత వరకూ బాగానే వుంది; అది అందరకూ చేతనైన పనే! ఆ తరవాత తిండీ, తిప్పలూ—ఇల్లూ, వాకిలీ—ఎన్ని ఉన్నయ్! ఈ పాడు దేవుడు ఆకలనేది పెట్టకపోతే మనకెంత బాగుండును?"

సంసారమంటే తెలియని నేను—ఊహాప్రపంచంలో సంసారాన్ని చూచాయగా చూడగలుగుతున్నా. ఇన్ని పెద్దఊహాలున్నయ్యా—తనకం బుల్లిబుర్రలో? స్కూలుఫైనలింకా ప్యాసవని నేను, లోకజ్ఞానం పూర్తిగా లేని నేను, భూగోళశాస్త్రం తప్పనిసరిగా బట్టీపెట్టి—జాగ్రఫీ మాస్టరు చెప్పే దేశాల్నీ పట్టణాల్నీ గూర్చి విని, మ్యాపుల్లో చూచి—అసలు నిజంగా అలాంటివి వున్నయ్యా అనే అనుమానానికి అప్పుడప్పుడు గురవుతున్న నేను—ఈ కనకాన్ని వేశపుచ్చుకొని ఎక్కడికి వెళ్లేది? ఏ సూటుకేసో, బెడ్డింగో ఐతే ఇంత ఇబ్బంది వుండదేమో కాని—ఒక ఆడదాన్ని తీసుకొని పర్యటనం మొదలు పెడితే—ఎన్నో కష్టాల పాలవుతానని నాకు స్ఫురిస్తోంది. పురుషుడు సంపాయిస్తూంటే సంసారంసాగుతుంది, కాని బీదవాడికి ఇల్లాటి పారిపోవటాలు అంత సులభమా? ఎక్కడికో—ఏ అపరిచిత స్థలానికో వెళ్ళి మన ముఖూ మొగమూ ఎరగని నూతన వ్యక్తుల మధ్య నూతన వాతావరణంలో ఆకలిమంటల్లో అల్లాడిపోతూ తిరగటం—తలుచు

ఉంటేనే దుర్భరమనిపిస్తోంది. అయినా కనకం ఉద్దేశ మేమిటో తెలుసుకుందామని అన్నా:

"ఎక్కడికి పారిపోదాం?"

"ఎక్కడికన్నా—ఏ బొంబాయో, కలకత్తాయో—" ఆ పట్టణాలు జేరేందుకు ఏయే రైళ్ళు ఎక్కాలో కూడా నాకు సరిగ్గా తెలీదే! కనకం తనకా పట్టణాలు బహుపరిచయమైన వన్నట్టుమాట్లాడుతోంది!

"వెళ్ళేందుకు డబ్బు కావొద్దూ?" రైలువాళ్లు ఏ ప్రేమ పక్షుల్నీ (ఆ ప్రేమ నిర్మలమైనా అనిర్మలమైనా సరే!) కరుణించి ఒకదేశం నుంచి ఇంకో దేశానికి ఉచితంగా జేర్చే పద్ధతి అసలు పెట్టుకోలేదని దృఢంగా తెలుసు!

తనువుకోకుండా, "ఇదుగో" అంది—మెడలో చంద్రకాంతిలో మెరుస్తూన్న గొలుసును వేళ్ళతో ఎత్తి చూపుతూ. ఆమె నున్నని మెడను హాయిగా ముద్దాడుతూన్న ఆ గొలుసుకు ఆభాగ్యంకూడా పోతుందా? అదెక్కడికో పరుగెత్తుతోం దన్నట్టు దాన్ని పట్టుకొని, జపమాలికలా తిప్పసాగాను. ఇంకా వేలినవున్న ఉంగరమూ, చేతుల కున్న గాజులూ, కాళ్ళపట్టాగొలుసులూ—ఇవన్నీ మరిచిపోయిందా?

"ఇవన్నీ అయ్యాక?" మెరిసే ఆ కళ్ళను ఒకసారి అటునుంచి ఇటుతిప్పి, "సంపాయిద్దాం—" అంది—అది బహు తేలికైన దన్నట్టు!

అందరూ సంపాయిస్తూండటం చూసి మనంకూడా సంపాయిద్దా మనుకొందా? ఈ సంపాయిచటం నా నెత్తినే పడేదని నాకా బాధ్యత స్ఫురించింది.

"మన మొఖంచూసి ఏ తలమాసినవాడు ఉద్యోగం ఇస్తాడు!" అన్నా.

"నేను అనుకున్నాను—నువ్వు చాలా ధైర్యస్థుడివని" క్షణంలో గొంతు మారింది. ఆ వోణికే కంఠంలో దీనత్వం ఇమిడివుందని నా చెవులకు తెలుసు. తనతో లేచివస్తే నేను ధైర్యసుణా! కొత్తగా

ఈత నేర్చుకున్నవాణ్ణి నమ్మి లోతునీళ్ళల్లోకి వెళ్తే—ముందుగతి ఏం కావాలి ?

"కని పెంచి పెద్దవాళ్ళను చేసిన మన ఆత్మబంధువుల్ని విడిచి వెళ్ళటమా ! మన సౌఖ్యంకోసం తమ సౌఖ్యాన్ని కూడా మరిచి పొయ్యేవాళ్ళు మన కక్కడ ఎవరుంటారు ? ఇక్కడ అన్నం తినక పోతే అమ్మ బతిమాలినట్టు—అక్కడ ఎవరు బతిమాలుతారు ? ఎవరికి అవసరం ? వెళ్ళాక—అనుభవ మయ్యాక పశ్చాత్తాపపడి ఏం లాభం ? చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టవుతుంది. కనకం ! నాకు నువ్వూ నీకు నేనూ దంపతులు గా వ్యవహరింపబడొచ్చు. చెప్పు: నువ్వు నాకు భార్యాత్వం వహిస్తావుకాని, మాతృత్వాన్నిఎక్కణ్ణుంచి తెచ్చుకుంటాం ? చివరికి దుకాణమంతా బైటపడ్డాక, మన మేకపోతు గాంభీర్యంపోతుంది. అప్పుడు నలుగురు పెద్దమనుషుల మధ్యా పెట్టి సాగతీసి, సాగతీసి అడుగుతూంటే—వాళ్ళ నవ్వూ, మన రోషమూ, ఆవేదనా, ఒద్దు బాబూ—ఒద్దు—ఇల్లా బతికితే బాగుంటే చాలు !—"

వింటోంది నేను చెప్పినదంతా. కింది పెదవి విరిచి మాట్లాడ బోయింది. మళ్ళీ నేను చెప్పసాగాను: "నీమీదనే కళ్ళన్నీ పెట్టుకొని నీకోసమే జీవించి వున్న తల్లిని విడిచి పారిపోతావా ? మనం చేసే పనికి మన తల్లిదండ్రుల ప్రతిష్టలుపోయి—వాళ్ళెంత నొచ్చుకుం టారు ! ఇక్కడలేని నూతనత్వం అక్కడేముంది ? దూరపు కొండల నునుపు మరిచిపొయ్యావా ? ఎల్లా సంపాయిస్తాం ? తీరా రంగంలో కాలుపెట్టాక, అనుభవానికొచ్చి, అప్పుడు తెలిసొస్తే మాత్రం ఏం లాభం ? ఇది తీరని కళంకమై—మనుషుల్లో ఎవరూ క్షమించలేనినేర మౌతుంది—ఎందుకు ఈలేనిపోని తద్దినాన్ని మెడకు తగిలించుకోవటం?"

ఇంకా నాకు తెలిసినవన్నీ చెప్పా. ఏదో ఆలోచిస్తూ అంది : "అందరికూ తెలిసిపోలేదా మన రహస్యం ?"

"ఎందుకు తెలీదు ? రంకూ బొంకూ దాగుతుందా ? నిజంగా తెలిసినవాళ్ళూ, చూచాయగా తెలిసినవాళ్ళూ, అసలు తెలీనివాళ్లూ

—వీళ్ళందరి కోరచూపులూ చూడటంలా ? వాళ్ళదృష్టి తీక్ష్ణతతో ఏదో వైవ భయం రోజు రోజుకూ అధికమౌతోంది..." నిజంగా కొంతమందికి తెలియకపోయినా—వాళ్ళకూ కూడా తెలిసిపోయిందనే నా అనుమానం; ఇది Guilty concience పొందే పరిణామాల్లో ఒకటని ఇప్పుడు తెలుస్తోంది.

"అందుకే రాజా! ఎందుకీ ముసుగులో గుద్దులాట ? లోకానికున్న కళ్ళను మూసెయ్యగలమా ? ఈ అజ్ఞాత వాసాన్ని వొదిలించుకొని పారిపోతే...!"

"ఇప్పుడు నిజమైందీ, ఇంతకన్న క్రూరమైందీ అజ్ఞాత వాసం తయారౌతుంది. ఏదో అజ్ఞానంలో పారిపోంగానే సరా ?"

కంఠస్వరాన్ని ఎక్కించి ఉపన్యాస ధోరణిలో మొదలుపెట్టింది: "చూడు! మనను చూసి నలుగురూ నవ్వటంలా ! ఇల్లా భయపడి చాటుగా మాటుగా ఒత్తుకు తిరిగేందుకు నీకు సిగ్గులేదూ ? మనకు పెట్టనివాళ్లూ, మనతో సంబంధం లేనివాళ్ళకూ కూడా మన గోడవే పట్టిందా ? ఎవరిదార్న వాళ్ళుపోకూడదా ? వీళ్ళందరూ పుణ్యాత్ములూ మనిద్దరమే పాపాత్ములమైనట్టూ—వేలుపెట్టి మనను చూపి వెక్కిరించి, వేళాకోళంచేసే యీ పెద్దమనుషులందరూ వాళ్ళ అంతరంగిక జీవితాల్ని కూడా తరిచి చూస్తే ఇల్లాంటి తప్పులు బైటపడవా ? నాకు తలకొట్టేసి నట్టుంది రాజా ! మనం వాళ్ళకు ఏం హాని చేశాం—మనను తూలనాడి మనకు బాధ కల్పించేందుకు—?" చెప్పలేక రెండు కళ్ళనూ నీళ్ళతో నింపింది.

నాకు ధైర్యం చెప్పే కనకం—నేను ఏడుస్తూంటే 'సిగ్గులేదా ?' అని అడిగిన కనకం—జీవితంలో మొట్టమొదటిసారి నా కళ్ళ ఎదుట కంట తడిపెట్టడం—నాకు ఆశ్చర్యమే ఆయింది ! ముత్యాల్లా మెరుస్తూన్న ఆమె కన్నీటి కణాల్ని ఒత్తుతూ అన్నా : "వేటగాడికి ఏ హానిచేసింది—ఆ లేడి ? అవసరమైందీ, అనవసరమైందీ అనే విచక్షణ లేని ప్రపంచం ! గొప్ప ఇళ్ళల్లో చాటుగా, మాటుగా జరిగే పవిత్ర

వ్యభిచారాల్ని తెలుసుకోలేకా, ఒకవేళ తెలుసుకున్నా మనవికాదన్నట్లు వాళ్ళను అనలేక—నోళ్ళకు తాళాలు బిగుంచుకు కూర్చునే—గుడ్డి లోకం! మెత్తని వాళ్ళను మాత్రమే మొత్తాలని కత్తి కట్టుకు బైలుదేరే ప్రపంచం! వొదిలించుకుందామన్నా వదలక వెంటపడే లోకం! ఇత రులకు అపకారం చెయ్యటమే పనిగాచూసుకుంటారు! పోనీ—కనకం! అన్నీ మరిచిపో — ఎంత ఆనందమయమని భ్రమపడ్డామో— అంతా విషాదమయమైపోయింది! ఇల్లా భయపెడితే చివరకు మనం మొండి ధైర్యానికి గురై వాళ్ళ కళ్ళ ఎదుటనే ఎదురు తిరుగుతే— నివ్వెరపోయి తెల్ల మొగాలు వెయ్యరూ—వీళ్లందరూ! వాళ్ళకోసం మనం దేనికి దుఃఖించటం!" ఎక్కణ్ణుంచి వొచ్చెయ్యో ఆ బుల్లి నోట్లోంచి—ఇన్ని మాటలు! ఏదైనా సమయం వొస్తేనే కాని బైట పడదు కాబోలు!

ఆమె కళ్ళు పెద్దవిచేసి ఆకాశంలోకి శూన్య దృక్కుల్ని ప్రస రింప జేస్తోంది.

"కొన్నాళ్ళపాటు యీ దొంగతనాన్ని మానేద్దామా?"

"నీ ఇష్టం—"

"ప్రయత్నిద్దాం; ఈ గోలా, వీళ్ళ వెటకారాలూ తగ్గేదాకా ఆగుదాం—కొన్నాళ్ళపాటన్నా వాళ్ళు మరిచిపోనీ—" మొత్తానికి జీవితంలో బతికి వుండగా మాత్రం వీళ్ళందరూ మరిచిపోతారనే ఉద్దే శం నాకు అప్పటికీ, ఇప్పటికీ ఎప్పటికీకూడా—లేదు! మెల్లిగా 'సరే' నన్నట్లు తల వూపింది.

ఈ విషాద సంఘటన్ని ఆలోచిస్తూ కొంపజేరా. ఎవరికళ్ళా పడ కుండా వంటింట్లో మడిలో మూతపెట్టిన పాలను దొంగతనంగా తాగి చల్లగా జారుకునే పిల్లిలాగు చప్పుడు కాకుండా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మంచంమీద వాలటమూ, గడియారం ఐదు గంటలు కొట్టటమూ ఒక్కసారి జరిగాయి. ఇప్పటికి అమ్మా, నాన్నా లేచి ఏదో మాట్లాడుకుంటున్నారు.

"రాత్రిళ్ళు టలాయించేస్తున్నాడు—" అమ్మ అంటోంది—నేను అక్కడ లేననుకుంది కాబోలు!

"ఇవ్వాళ కూడానా?"

"ఇక ముందుకూడా అంతేనేమో?"

"వెధవను ఎదుటపెట్టి అడుగుదామనుకుంటా—కాని ఏడ్చిపోతాడని ఊరుకుంటున్నా—"

"ఆడగొద్దు—వాడి చదువు వెనకపట్టింది. రాత్రిళ్ళు తిరిగీ, తిరిగీ నిద్రకు దూరమై ఎర్రబారిపోయిన వాడి కళ్ళు చూడండి. తిండి సరిగ్గా తినడు; స్కూలుకు సరిగ్గా వెళ్తున్నాడో లేదో కూడా అనుమానంగా వుంది. పిచ్చివాడులాగు కాలుకాలిన పిల్లిలాగు తిరుగులాడుతున్నాడు. వాడి కాలకృత్యాల్లో శ్రద్ధ క్షీణించింది. రోజు రోజుకూ చిక్కిపోతున్నాడు. వాణ్ని అడుగుదామంటే ప్రాణం ఒప్పకుండా వుంది; ఎక్కడైనా మంచి సంబంధం చూసి త్వరలో పెళ్ళిచేసెయ్యండి—"

"నేనూ అదే ఆలోచిస్తున్నా—" మరి మాటలు లేవు.

దుప్పటి ముసుగులో ముడుచుకు పడుకొని దీర్ఘాలోచనలో పడ్డా. ఇంతమంది దృష్టికి కంటకంగా కన్పించేందుకు నా నేరం అంత గొప్పదా? నా మాతృమూర్తి హృదయాన్ని కూడా గాయపరిచానా? మా వాళ్ళకూ్కడా తెలిసిపోయిందా? నన్నెప్పుడూ కొట్టని, తిట్టని ఆత్మబంధువులకే బాధ కలిగిస్తున్నానా? నా కామ వ్యామోహంలో కన్ను గానక నిర్లక్ష్యంగా నా జీవితాన్ని నేనే పాడుచేసుకుంటున్నానా? నాకు తెలియకుండానే నాలో ఇన్ని మార్పులా? ఇంత త్వరగా నాకు పెళ్ళా? దాంట్లో వుండే కష్టసుఖాలు తెలీవు కాని, ఈ కొత్త వాతావరణానికి ఏదో చెప్పలేని భయం పుట్టింది. నాచదువుకూడా పాడైపోయిందా! రేపట్నుంచీపట్టుదలగా చదవాలి నన్ను అనుమానిస్తున్న వీళ్ళందరికీ గుణపాఠాన్ని బోధించాలి. అమ్మను తృప్తిపరచాలి; చివరికి ఈ నిశ్చయాని కొచ్చా.

# 7

త్రాగుడు బాగా అలవాటైనవాడు ఆ దుర్వ్యసనాన్ని వొదిలించుకునేందుకు ఎంత బాధ పడతాడో నాకు బాగా అర్థమైంది.

చదువుమీద ఎంత మనస్సు నిలుపుదామని విశ్వప్రయత్నం చేసినా—అది కనకంవైపు పరుగెత్తకుండా వుండేదికాదు. మన మనోనిబ్బరమూ, పట్టుదలా కలిసి విశ్వాసంగా పనిచేస్తే జీవితం ఇంత దుర్భరమనిపించదేమో! బిస్కెట్ ముక్కను చూస్తూ ఆశపడి తోకత్తి దాన్ని అందుకునేందుకు ప్రయత్నించే కుక్క అవస్థలాగైంది—నా పని. నా కళ్ళ ఎదుట నాకు వశమైన కనకం ఆశలు పెడుతూండటం—దాన్ని సరిగ్గా ఎదుర్కోలేనేమోననే అనుమానానికిదారిచ్చింది. ఈ దుర్బల హృదయంతో నేను లోకంలో—జీవితంలో, దేన్ని సాధించలేనా!

పరీక్షలు దగ్గరకొస్తున్నై. ఎనిమిదో ఏటనుంచీ కష్టపడి చదివిన చదువంతా వ్యర్థమేనా! ఖాళీ బుర్రతో ధ్వజస్తంభంలాగు పరీక్షలకు కూర్చొని మాత్రం ఏం లాభం? ఇక ఇది 'విధివిలాసం' అని నాకు నేను తృప్తిపడనా! అంతా ఆ 'విధి'కే వొదుల్తే మన మెందుకు! సముద్ర మధ్యంలో వున్న నావను గాలిమీదా విధిమీదా వొదిలి ఊరుకుంటారా! రాసిపెట్టిన చావు ఎల్లాగూ తప్పదని మందులూ మాకులూ వాడకుండానే ఊరుకుంటారా! అప్పుడేమైనాడు—ఆ విధి!

కష్టపడి పట్టుదలగా చదవటం మొదలు పెట్టా. సగం అర్థమయీ, సగం అర్థంకాక వ్యర్థమయీ, తెలిసిన చదువునే తెలియనట్లు 'ఛీ' లవుతూ ఎల్లాగో చదువు సాగించా. ఇంక కొద్దిదినాల్లోనే పరీక్షలున్నాయన్న సంగతి జ్ఞాపకమొచ్చి నన్ను కలవరపెట్ట సాగింది. పరీక్షలు—విద్యార్థి దశలో భయపెట్టే మహాభూతాలు! సప్త సముద్రాల్నీ ఈదిన కాశీ మజిలీల్లోని రాజాలకేం తెలుసు వీటి తడాఖా? నిజమైన

చదువూ, కష్టముకూడా నష్టమై మోసానికి గురిచెయ్యగల శక్తివుంది— వీటిల్లో! ఇది తెల్చుకొని—ఇదివరకు ఎన్నడూ వీటికి భయపడని నేను—ఇప్పుడు వెర్రిభయంతో కుంగిపొయ్యా. ఈ సంవత్సరం తప్పిపోతే నా జీవితమే నాశన మౌతుందని వీళ్ళందరూ తలుస్తారని నాకు తెలుసు; కాని ఇది నా దృష్టిలో ఆనింది కాదు.

తెల్లారితే పరీక్షలు! కనకంకూడా నాలాగే బాధపడుతోందా? ఈ పరీక్షల్లో నే నామెకు ఏ సహాయమూ చెయ్యలేనా? ఎవరి గోల వారిదేనా! మరి కొన్నాళ్ళపాటు ఈ పరీక్షలు ఆగుతే ఎంత బాగుండునో ననిపించింది? ఈ కాలమూ, ఈ సూర్యుడూ మన కోసమే అయినా—మన కోసం ఆగుతారా? కృష్ణభగవానుడంతటి వాడికి చాతకాక కాస్సేపు చక్రాన్ని అడ్డం పెట్టుకున్నాడు. ఇప్పుడు ఆ శక్తీ నశించింది; ఏ చక్రాల్ని ఎవరు అడ్డం పెట్టుకోగలరు?

చదివీ చదివీ విసుగు పుట్టింది. ఈ చదివింది పరీక్షలకు చాల్దనిపించింది; అన్నీ తెలిసినట్టుగానే ఉంది. కర్కశ హృదయాల్లో కఠినంగా పేపర్లిచ్చే మహానుభావులూ—'వీడికింత తెలివి వుందా? కాపీ కొట్టాడా?' అనే అనుమానంలోపడి—ఇంట్లో భార్యపెట్టిన చివాట్ల ఫలితాన్ని పేపర్లమీద చూపుతూ—తమ పీనాశత్వాన్ని ప్రత్యేకంగా ఇక్కడ ప్రయోగించి, కొసరి కొసరి మార్కుల్ని పంచే మహానుభావులూ జ్ఞాపకానికొచ్చారు. ఏమైనా నేను ప్యాసవగలనని నాకు ఎవరో చెప్తున్నారు. చదువుకు స్వస్తి చెప్పా.

పేపర్లు ఎక్కడైనా ఔట్ అయితే అదృష్టవంతులమని ఊరంతా బీరుపోకుండా గస్తీ తిరిగే విద్యార్థులూ, ఔట్ అయిన రకరకాల పేపర్లనూ పోల్చుకోలేక (అసలు వస్తువు తెలియంది, ఇమిటేషన్ వస్తువు ఎల్లా తెలుస్తుంది?) భ్రమించి—పరీక్షార్థం జీవితంలో మొట్టమొదటిసారి పుస్తకాన్ని విప్పి, రాత్రంతా టీ తాగి జాగరంచేసి చెమటోడ్చి చదివి—పేపర్లివ్వంగానే తెల్లమొగాలు వేసి నిరాశ చూపుల్ని చూసి, హాలువాసాల్ని లెక్కిస్తూ లొట్టలేస్తూ కూర్చునే విద్యా

రులూ జ్ఞాపక మొస్తున్నారు.

కనకం—పాపం ఏం చేస్తోందో? తనతో కలిసి చదువుకునేందుకు రాలేదనీ, నాకక్కర్లేని ఆనందాన్ని పొందేసి ఆమెను అవతలికి నెట్టేశాననుకొందా? నా స్వార్థంతో ఆమెను బాధిస్తున్నానా? ఆమె నొక్కసారి చూసి రావాలనిపించింది.

రాత్రి పదిగంటల సమయాన వాళ్ళింటికి వెళ్ళటం (దొంగతనంగా కాదు—దొరతనంగా !) అదే మొదటిసారి. ఆమె తల్లి వొచ్చి తలుపు తీసి నన్ను గురించింది—ఆ నిద్రమత్తులోనే !

"కనకం ఏం చేస్తోంది?"

"పైనవుంది—వెళ్ళు నాయనా !" పాపం! నేనంటే అనుమానం లేదు. నా బాహ్యరూపాన్ని పట్టి నన్ను నమ్మేసింది.

కనకాన్ని ఆశ్చర్యపెట్టాలని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ చప్పుడు కాకుండా పైకి వెళ్ళా. పుస్తకం ముందేసుకొని దానిమీద ముఖం పెట్టుకొని, తలను రెండు బాహువులమధ్యా యిరికించుకొని వుంది. వసివారిన లాంతరు మాత్రం తనలోపమేమీ లేనట్టు వెలుగుతూనే వుంది. ఆమెను ఆశ్చర్యపెట్టాలనుకొన్న నేనే ఆశ్చర్యపోయి, "క—నకం!" అన్నా.

దుఃఖతరంగాలు గంతులేసే గొంతుతో, "ఊఁ" అంది. ముఖం ఎత్తకుండానే. మెల్లిగా ముఖమెత్తింది. చెమటలు కమ్మిన ఆమె ముఖంలో—స్వేదబిందువులకూ ఖేదబిందువులకూ భేదం తెలీటంలేదు. ఎందుకు ఏడుస్తోంది? నీళ్ళతోనిండిన రెండు కళ్ళనుంచీ జారిపడిన కన్నీటి జలం—పుస్తకంలోని అచ్చునే తుడిచేందుకు వ్యర్థప్రయత్నం చేసింది. చెల్లాచెదరుగా ఫాలభాగంమీద వాలిన ముంగురుల్ని పైకి నెట్టేశా. ఎంతగా దుఃఖిస్తోందో—ఆమె ముఖం వాడి వుంది! నా ఆరో ప్రాణ మనుకొన్న కనకం—ఇంత బాధపడుతోందా? ఇదంతా నా తప్పా? పమిటచెరగుతో ముఖమంతా తుడుచుకొంది.

"ఎన్నాళ్ళనుంచీదుఃఖిస్తున్నావ్—కళ్ళుఇల్లా ఎర్రనయ్యాయ్!"

"లేదు...వేడిచేసి కళ్ళవెంట నీళ్ళొస్తున్నయ్...ఇదాంక తలంటి పోసుకుంటూంటే కుంకుడుకాయ పిప్పి కంట్లో పడ్డది...చదువుతూంటే...కంట్లో నలక పడ్డది." ఇంకా లేవా కారణాలు? దుఃఖంలో సంతోషాన్ని రూపించేందుకు ఆమె బలవంతాన ప్రయత్నిస్తోందని తెలుసు: ఆమె కంఠస్వరంలోని విషాదం ఇందుకు సాక్ష్యం కూడా ఇస్తోంది. అందులో—నా స్థితిలో ఏడుస్తున్న వాళ్ళని నేను అతి సులభంగా పట్టుకోగలను. మెల్లిగా ఫాలభాగాన్ని తాకుతూ, "పరీక్ష పోతుందనా?" అన్నా.

గొంతు సవరించుకొని, "ఛా—వెధవ పరీక్ష" అని. క్షణంలో mood మార్చుకొని తిరిగి అంది: "అనుకుంటున్నాను—ఇప్పుడు నువ్వొస్తావని—"

"కలకన్నావా?"

"ఏమో—అల్లా అనుకున్నాను" ఆమె దుఃఖానికి కారణం తెలుసుకు తీరాలనే పట్టుదల అధికమైంది.

"నాకు చెప్పవూ? ఎందుకు—పరీక్ష పోతుందనే కదూ—ఇల్లా దుఃఖించటం?"

"ఇనేమన్నా ప్రాణగండమా? పోతే పోతుంది వెధవ పరీక్ష!" ఎంత సులభంగా అనేసింది! ప్యాసవునే అధైర్యంలో, నిరాశతో పరీక్షంటే ఎందుకూ పనికిరాని దానికింద జమపడి—విరక్తికలిగించిందా!

"పోనీ నిజం చెప్పు—అదీ కొంత వుంది కదూ!"

మెల్లిగా తల వూపింది. 'కొద్దిగా వుంది' అన్నట్టు సూచించేందుకేమో! పిచ్చిపిల్లలాగు ఎల్లా తయారైంది! ఆమెలోని ఉత్సాహాన్నంతట్నీ చంపేశయ్యా—ఈ వెధవ పరీక్షలు? నేనే అనుకుంటే నాకన్న అధఃపతితగా తయారైంది! నాకు నేనే మనశ్శాంతిలేక అసహాయ స్థితిలో ఉన్నా—ఆమెను ఓదార్చుదామనే ప్రయత్నంలో వున్నా. పరీక్ష ప్యాసయ్యే సూక్ష్మమార్గాలు కుప్పలు కుప్పలుగా నా కళ్ళముందు దొర్లాయి.

"కనకం ఒక్కపని చేస్తావా ?"

"ఏమిటి ?" లోతుగా నా కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

"పేపరు రాసి నా నెంబరు వెయ్యి. నేను నీ నెంబరు వేస్తా—" నాలో నిజానికి నాకే నమ్మకం లేదు. అయినా ఆమెకు అండగా నిలబడాలనే ఉద్దేశం బాగా పనిచేస్తోంది.

ఖేదం పోయి ఆమె ముఖంలో ఒక్కసారి మోదం ఉట్టిపడ్డది. "రాజా ! ఎంత మాటన్నావ్ ! అనుకున్నాను— నాకోసం జాలి పడే వాళ్ళెవరూ లేరని ! కాని నీ నోటినుంచి వెలువడ్డ—ఆమాట—మాట చాలు...!" మాటల్లోనే తృప్తి ?

"చేస్తావా మరి !" నాకు అధికారం లేనిదాన్ని త్యాగం చేస్తున్నాననీ తెలుసు.

"అల్లాటి పనా ? ఛస్తే చెయ్యను—పోతే పోతుంది పరీక్ష. ఆడదాన్ని ప్యాసై మాత్రం ఏం చేస్తాను ? నా కెల్లాగూ నిగుపరయో గమేగా ! నువ్వు ప్యాసవుతే నీ భావిజీవిత సౌఖ్యానికి సోపానమౌతుంది—"

"కాదు—తప్పకుండా చెయ్యాలి—" ఆమె ఒద్దన్నదనే ధైర్యమో, ఆమెను ఎల్లాగైనా తృప్తిపరచాలనే ధృఢ నిశ్చయమో నాలో పనిచేసి వుంటై.

"నీ కేమన్నా మతిపోతోందా రాజూ ? ఇంకా కాపీ అన్నా కౌవతాకాని..."

"కాపీయా ?" అన్నా నేను చెప్పిన ఉపాయంకన్న ఇది అపాయమైందన్నట్టు సూచిస్తు.

"ఔను—కాపీకొట్టి పట్టుబడితే నీ నొక్కతెవే డిబారవుతా; అది స్వయంకృతాపరాధమౌతుంది. నువ్వు చెప్పినట్టు చేసి పట్టుబడితే, ఇద్దరమూ డిబారవుతాం. నాకోసం నువ్వేమీ త్యాగం చెయ్యొద్దు. ఒక స్త్రీకోసం ఏ తృణాన్నయినా సరే త్యాగం చేశావంటే లోకం ఎప్పుడూ హర్షించదు. నాకోసం నీ విజ్ఞానాన్నీ, నీ

గౌరవాన్నీ కూడా పాడుచేసుకుంటావా—ఒద్దు—రాజా—ఏమీ వొద్దు—"

ఆమెకు కష్టమైన చదువులన్నీ నా బుర్రలో తిరిగాయ్.

"నీ కసలు హిస్టరీ రాదు—"

"ఆ రాకేం? చెప్తా విను? జనన మరణ రిజిస్టర్లలాగు తారీకులు గుర్తుంచుకోవాలి. '1830 లో ఏమైందీ?' 'రాజుగారు పుట్టారు' '1839 లో ఏమైందీ?' 'రాజుగారికి తొమ్మిదేళ్ళు వొచ్చాయి' 'ఒకటవ ఛార్లెస్ రాజవంగానే ఏం చేశాడు?' 'సింహాసనంమీద కూర్చున్నాడు—'" పెద్దపెట్టున నవ్వింది; ఈ హాస్యానికి నాక్కూడా నవ్వొచ్చింది.

"పరీక్ష కసలు కూర్చోవా?"

"కూర్చుంటా. కాని ప్యాసవుతాననే ధైర్యం లేదు." ఆమె అధైర్యపు మాటలకు, నన్నుకూడా అధైర్యం కమ్ముకుంటోంది.

ఆమె ముఖంలోకి చూస్తూ కూర్చున్నా. ఈ వాతావరణంలో ఎంత మార్పు వొచ్చిందో ననుకుంటున్నా.

"ఈ చీకట్లో ఎందుకొచ్చావ్?"

"నీ కోసమే—"

"నేను కావాలా?"

"కాదు—చూసిపోదామని వొచ్చా—"

"చూశావుగా...ఇంక వెళ్ళి చదువుకో—" ఆ మెరిసే కళ్ళు నుంచి వెలువడే కాంతి ప్రవాహాలు నన్ను పోనిస్తయ్యా? ఒళ్ళంతా కళ్ళుచేసుకొని యీ విషాదమూర్తిని చూస్తున్న నాకు యీలోకాన్నే విడిచినట్టుగా వుంది. పాలుపోక మౌనంతో ఆమె చెక్కిళ్ళమీద కన్నీటి చారల్ని పరికిస్తున్నా.

"ఇక్కడ పడుకుంటావా?" ఇప్పుడు కొత్తగా ఆమె కావాలనే కోర్కె రేకెత్తుతోంది. అణిగి మణిగివున్న కామధూమాలు శరీరాన్ని కమ్ముకుంటున్నాయి. కోర్కె! పరిస్థితులూ, వాతావరణమూ

అనుకూలంగా ఉన్నప్పుడల్లా రేకెత్తుకొస్తుంది కాబోలు—'క్షోర్క్య!'

"మీ అమ్మ ఏమన్నా అనుకోదూ?"

"భయపడుతున్నావా? నీ ప్రాణానికి నా ప్రాణాన్ని అడ్డేయ్యనూ—!" నేను మాట్లాడకుండా శూన్యదృక్కుల్తో చూస్తున్నా. నా ఇంగితం గ్రహించినట్టు, "ఇప్పుడే వస్తా—" అంటూ కిందికి జారింది. మరుక్షణానికి జరుగబొయ్యేదాన్ని కూడా ఊహించలేని మానవ అశక్తత వ్యక్తమౌతోంది. తలకువ్వి పొడ రద్దుకొని—పావుగంటకు తిరిగి వొచ్చింది; నేను తనకు ఏం ప్రతిఫల మిస్తున్నానని—నాకోసం ఇంతగా పాకులాడటం? తల్లికి ఏమి ఊదివొచ్చిందో నాకైతే తెలీదు. నాదగ్గరిగా కూర్చొని అంది; "రాజా! ఈ ఇరవై రోజుల్లోనూ నే నెప్పుడన్నా జ్ఞాపక మొచ్చానా!"

ఆమెను తాకనివాళ్ళే ముప్పతిప్పలూ పడి మూడుచెరువుల నీళ్ళూ తాగుతున్నారని నాకు తెలుసు. ఇంక నా వేదనను ఎల్లా చెప్పేది! "నన్ను ఊహల్లో, సోహల్లో, జాగ్రదావస్థలో, సుషుప్తావస్థలో చంపుకుతిన్నావ్—" అన్నా, 'నే చెప్పేదంతా ఈ ఒక్క వాక్యం లోనే యిమిడివుంది' అన్నట్టు చూస్తూ.

"పోనీ రాజా—అన్నీ మరిచిపో—ఈ బాహ్యప్రపంచమే లేదనుకో—ఇది నూతన లోకమనుకో—" అంటూ నన్ను తన వెచ్చని కౌగిలిలోకి లాక్కుంది. ఈ పట్టుదలా, మనోబలమూ మటుమాయమయ్యాయి. ఇవన్నీ తాత్కాలికంగా మరిచిపోయి ఈ నూతన వాతావరణంలో ఐక్యమైపొయ్యా.

# 8

పరీక్షలైపోయి ఎంతకూ తరగని ఎండాకాలపు శెలవలు ప్రారంభమయ్యాయి. పంజరంలోంచి తప్పించుకొన్న చిలకలాగు స్వేచ్ఛ—అంతా స్వేచ్ఛే! ఆ బుసుపోక—తినటమూ, తిరగటమూ తప్ప వేరే

పనేమీ ఉండేదికాదు. పేపర్లు ఎట్లా రాశానో—ప్యాసవగలనో, లేనో కూడా నాకేమీ తెలియదు; ఒక్కొక్క సమయాన మానవుడు తనశక్తిని తనుకూడా తెలుసుకోలేడు కాబోలు! ఎన్ని ఉద్ధండులు వొచ్చినా—ఎంతమందిచేత తిట్లూ, దీవనలూ తింటూన్నా, ఎన్ని కష్టాలను గురవుతున్నా—నాకు కనకమూ, కనకానికి నేనుగా కాలాన్ని చంపుకుంటూ జీవిత పథంలో తప్పటడుగులు వేసుకుంటూనే వెళ్ళిపోతున్నాం.

వేచి కాచుకు కూర్చున్న పుణ్యకాలం సమీపించి పరీక్షాఫలితాలు రానే వొచ్చాయ్. ఆ కొండ చీమల బారులో కంటికి పట్టినంత దృష్టితో నా నెంబరుకోసం వెతకాను; ఆ కంపోజిటర్ గాడు కఠిన హృదయంతో నా నెంబర్ను తోసి పారేశాడు: కనకంకూడా నన్నే అనుసరించింది. ఇది నాన్నకూ అమ్మకూ చాలా కష్టమనిపించింది.

"ఇంకా సెకండులిస్ట్ వుందిగా—" అన్నాడు నాన్న—అప్పుడు కూడా పప్పులో కాలేస్తే ఆవారా, ఈవారా ఒక్కసారే చీట్లు పెట్టొచ్చన్నట్టు చూస్తూ.

నామూలాన మరి రెండు ప్రాణులు బాధపడుతున్నాయనే విచారానికీ, నా కళ్ళ ఎదుట చదివిన ఇంతమంది విద్యార్థులు ప్యాసై భుజాలెగరేస్తున్నారనే ఈర్ష్యకూ, నేను తప్పిపోయ్యాననే పరాభవానికీ—గుర్రై—దిగులుగా రెండురోజుల పాటు—అగడినే లోకంగా చూసుకున్నాను. మూడోనాటికి పాతపడిపోయిన విచారాన్ని గూర్చి విచారించకుండా, నాకు నేనే ధైర్యం చెప్పుకుంటూ కనకం దగ్గరకు వెళ్ళాను.

"ఊళ్ళోనే వున్నావా ?" అంది, తలవొంచుకునే, వూ..

"పరీక్ష పోయిందని దిగులా ?"

"లే—దు" అన్నా అంతా కమ్మేద్దామని.

"నా మూలానే పోయింది—కదూ ?"

"ఎవరన్నారు—ఆ మాట ?"

"మీవాళ్ళనలా!"

ఒక విధమైనరోషంతో "నువ్వు విన్నావా?" అన్నా.

"లేదు—ఊహించా."

"అర్థంలేని ఆలోచనలూ, పరిమితిలేని ఊహాలూ నీ బుర్రలో ఉన్నయ్యన్న మాట?"

"కోపం వొచ్చిందా!" మౌనంతో కనుబొమల్ని చిట్లించి కూలబడ్డా. కొంచెం తగ్గుస్థాయిలో అంది: "నువ్వైనా ప్యాసవుతావనుకొన్నా—రాజా! నువ్వు ప్యాసవుతేనే చాలనుకొన్నా. ఇద్దరిదీ పోయింది. నాది పోయినందుకు నాకు విచారం లేదు. నీది కూడా పోయిందేమో అనీ, నీ భావిజీవితాభివృద్ధికి సహాయపడే నీ చదువుకు భంగం కలిగిందేమో అనీ విచారపడుతున్నా—"

నా అభివృద్ధే తన అభివృద్ధిగా తలుస్తోంది! నా ఆత్మబంధువులు చూపే ఆదరణను చూపుతోంది! నా కష్టాల్లో కావాలని కాలుపెడుతోందే! తన వ్యక్తిత్వానికన్న నా వ్యక్తిత్వానికే అధిక ఆధిక్యతను యిస్తోందే! చాలు—ఈ లోకంలో ఇల్లాటి హృదయం ఒక్కటే వుంటే చాలు—ఎన్ని కష్టాలొచ్చినా మరిచిపోవచ్చు: అది బాధే అయినా, ఆ బాధలో కూడాసౌఖ్యం వుంది; ప్రతిమానవుడూ కోరేది ఇదేనేమో? ఇదివరలో నేనుగ్రహించలేని ఒకానొకదివ్యత్వం కనకంలో నాకు కన్పించింది. నా హృదయపూర్వకంగా ఆమెను అభినందించుకొన్నా. ఆమెకూ నాకూ యీనాడు తెగని బంధమొకటి ఏర్పడ్డదని తలిచా.

సెకండు లిస్టులో ప్యాసయినా; ఇది నాకు కొంతవరకూ ఉత్సాహాన్నిచ్చింది. కాని కనకానిది పోయింది. ఈ దిగులుతో ఆమె మనస్సు పాడౌతుందనుకొన్నా. ఆమెను కనీసం మాటల్తోనయినా ఓదార్చి కృతజ్ఞతన్నర్పవలసిన బాధ్యత వుందని బయలుదేరా. నేనెల్లా అనుకున్నానో అంతా తారుమారైంది; నన్ను చూడంగానే ఎదురొచ్చి నవ్వుతూ అంది: "రాజా! ఇప్పుడు అనుకుంటున్నాను—ఎగ్జామి

వాళ్లుకూడా మనుషులేననీ, వాళ్ళకూడా రీజనింగూ, న్యాయమూ ఉన్నాయని! నువ్వు ప్యాసయ్యావ్—చాలు—నా జీవితంలో ఇది చూడగలుగుతేనే చాల్ననుకున్నా—" ఏమిటో ఈ అర్థంలేని అమాయకపు సంతోషం? నాకు ముల్లు గుచ్చుకుంటే— తనకూడా బాధేనా? నా కష్టమూ, సుఖమూ, ఖేదమూ, మోదమూ—అన్నింటిల్లోనూ సగపాలును పోట్లాడి లాక్కుంటుందా! నా అంతరాత్మకు ఆత్మబంధువై సంచరిస్తూన్న—కనకం—నాకు ప్రియబాంధవి అయింది!

"నువ్వు తప్పావు—కనకం—నాకు చాలా విచారంగా వుంది—" ఇలాటి సానుభూతి వాక్యాల్ని ఏకరువు పెట్టాను.

"నాకు లేని విచారం నీకు దేనికి? నేనేం ఉద్యోగాలు చెయ్యక్కర్లేదు; ఊళ్ళేలక్కర్లేదు. స్త్రీకి విద్య ఎంత అవసరమో—అంతా నాలో వుందనే నా నమ్మకం. ముందుముందు అభివృద్ధిలోకి రావలసిన వాడివి—నాగూర్చిన విచారంతో బాధపడబోకు. ఒక స్త్రీ పురుషుడి జీవితాన్ని పాడుచేసిందనే లోకుల అభిప్రాయానికి తావు ఇవ్వొద్దు. గుడ్డివాడికి పగలైనా వొకటే—రాత్రైనా వొకటే—అంతే! నేను ప్యాసైనా వొకటే—తప్పినా వొకటే!"

# 9

కాలేజీలు తెరిచే రోజులు సమీపిస్తూండగానే, నాన్నా అమ్మా కలిసి నన్ను బి. ఏ. దాకా చదివించాలనే నిశ్చయాని కొచ్చారు. కాని నాకు ఇప్పటికి వున్న విజ్ఞానం చాల్ననీ, మరి ముందు చదువు వృథాయే మోననే ఉద్దేశం కలిగింది. కాలేజీ కుర్రవాళ్ళు కులాసాగా అయోమయపు ఆనందంతో జీవితాల్ని గడుపుతారని విన్నా. కాని, నాకు ఉన్న ఆనందమే చాల్ననీ—దురాశ ఎందుకనీ ఆలోచించా.

"రాజూ—బి. ఎ. ప్యాసై పెద్ద ఉద్యోగం చేస్తూంటే చూడాలని వుంది—" అమ్మ నాన్నతో అన్నమాటలు ఇంకా నా చెవుల్లో

ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయ్. వీళ్ళందరూ నా అభివృద్ధిని కోరే నన్ను పై చదువుకు పంపాలనుకుంటున్నారా? ఈ సమయంలో నా మాతృదేవతను సంతోష పెట్టకలసిన బాధ్యత నాది కాదా! కాని, నా ఆశయాల్నీ, నా ఆనందాన్నీ వీళ్ళకోసం బలిపెట్టనా? నా జీవితానికి నేను బాధ్యుణ్ణి కాకపోతే—వీళ్ళందరూ బాధ్యులా? ఏమీ తోచక కనకాన్ని సలహా అడిగా.

"వెళ్ళు రాజా—నువ్వు బి. ఎ. ప్యాసవ్వాలనీ, నిన్ను చూసి అందరూ మెచ్చుకోవాలనీ నాక్కూడా వుంది—" అంది.

చిన్నతనంనుంచీ—పుట్టి బుద్ధెరిగినప్పటినుంచీ నేను ఎరిగిన, పెరిగిన—యీ వాతావరణాన్ని వొదిలి, ఆ నూతన వాతావరణంలోకి వెళ్ళనా? పాత స్నేహితుల్ని ఇంకా పాత చేసుకొని, కొత్త మిత్రులకోసం దేవులాడనా? ప్రశాంతమైన సముద్ర మధ్యంలో ఆణిముత్యాల స్నేహాన్ని అనాదరించి, ఎందేమో పోసుకుందామని వడివడిగా పరుగెత్తుకొచ్చి—ఒడ్డునవున్న గండ్ర ఇసుకను చూసి పశ్చాత్తాపంతో వచ్చిన తోవనే తొక్కే సముద్రపు టలల సామెతే అవుతుందా—నా భావిజీవితం! అమ్మనూ, నాన్ననూ, కనకాన్నీ వొదిలివెళ్ళి అక్కడ మనశ్శాంతిని సంపాయించుకోగలనా? ఏమేమిటో అంతులేని తీరని సమస్యలు ఒకదాని తరువాత ఒకటిగా నాలో జేరుతున్నై.

"కనకం! నువ్వుకూడా ప్యాసైనట్టయితే నాతో వొచ్చేదానివి కదా!" అన్నా—ఏమున్నా లేకున్నా కనకం ఒక్కతే ఉంటే జీవితమే సక్రమంగా సాగిపోతుందన్నట్టు.

నవ్వి, "తప్పుతే రాకూడదా?" అంది. మరిచిపోయ్యా: ఈ యూనివర్సిటీలో స్త్రీలు స్కూలుఫైనల్ తప్పినా ఇంటర్‌లో జేరొచ్చనే రూలొకటి ఏడ్చింది! ఇవ్వి సరిగ్గా జ్ఞాపక ముండవు!

"మరి రాకూడదా?" అన్నా ఆశతో చూస్తూ.

"నేనా! ఇంక చదవను—నాకు ఇష్టంలేదు—" "నాకూ ఇష్టం లేదు—" అన్నా 'ఇష్టం' అనేది ప్రతిజీవికీ వుండే common అధికా

రమే అన్నట్టు చూస్తూ.

"నాతో వేనా నీకు లోకం ? పిచ్చివాడిలా మాట్లాడుతున్నావ్— రాజూ! పోనీ నేను బతిమాలుకుంటాను : నామాట వింటావా?... అయితే విను : వెళ్ళి చదువు. మూడు నెలలు తిరక్క ముందే శెలవలు, పండగలూ, గిండగలూ...అన్నీ శెలవలే! ఇక్కడికి వొస్తూందు కానివి. ఆ కాలేజీ ముచ్చట్లన్నీ నాకు చెప్తూందు కానివి...నీకేం తక్కువైంది—చెప్పు—వెళ్ళిరా—" చివరికి వొవ్వుతున్నా.

ఆనాడు వెళ్ళిపొయ్యేరోజు. ఇంతవరకూ, నాకూ, ఒకళ్ళనొకళ్లం వొదిలి వుండని అమ్మకూ, విచారంగానే వుంది. అమ్మ ఒక విధమైన సంతోషంలోనే దుఃఖాన్ని అనుభవిస్తూ కళ్ళనీళ్ళు పెట్టింది. కళ్ళు రెండూ నీళ్ళతో నింపి నిలబడ్డ కనకాన్ని విడిచివెళ్ళబుద్ధిపుట్టలా. ఆమెను చూసి నా కళ్ళుకూడా తడి అయివాయ్.

తన నీళ్ళు తుడుచుకొని, నా భుజంమీద తట్టుతూ అంది: "వెళ్లు రాజా! ఈ పాత స్నేహితురాల్ని మరిచిపోతావా ? కొత్తమిత్రుల గొడవలో నన్ను అడుగున పడేస్తావా? దూరానవున్నా మన స్నేహాన్ని తెంపవొక—ఉత్తరాలు రాస్తూంటావ్ కదూ! విచారం దేనికి? కొన్నాళ్ళపాటు ఇద్దరమూ దూర దూరంగా వుంటేనే కాని బాగుపడంలే! అప్పుడు కాని మనలో ఒకళ్ళ కొకళ్ళకు నూతనత్వం కన్పించదు—వెళ్ళిరా—నీ అభివృద్ధికోసం దేవుణ్ని ప్రార్థిస్తాను—నీరాకకోసం ఎదురు తెన్నులు చూస్తూంటాను...పోయిరా —" ఓదార్పు మాటలతో సాగనంపింది.

పెద్ద కాలేజీ కాంపౌండూ—, తండోపతండాలుగా వెళ్ళే విద్యార్థులూ, పెద్ద సినిమాహాళ్ళూ, పెద్దపెద్ద పట్టణపువీధులూ నా కళ్ళకు కన్పించాయి. అక్కడేదో ఆనందం వుందని ఎవరో చెప్తూనే వున్నారు, కాని, 'అంతకన్నా అధికమైనదాన్ని ఇక్కడ పోగొట్టుకుంటున్నావ్' అని నా అంతరాత్మ చెప్తోంది; ఎల్లాగో వీడలేక వీడలేక దారిపట్టా. చచ్చేవాళ్ళు చావలేక, చావలేక మంచం చుట్టూ

శేరిన తమ ఆత్మ బంధువుల్నీ వాళ్ళ విచారవదనాల్నీ చూసి, వీడలేక వీడలేక—ఇల్లాగే మృత్యు ముఖంలోకి ఎగబాకుతారు కాబోలు!

# 10

కాలేజీ జీవితం నా జీవిత నాటకంలోని ద్వితీయాంకానికి ప్రస్తావన అయింది. ఆ చదువువల్ల నేను బాగుపడ్డా, చెడిపోయినా—కష్టాల్నీ, దుఃఖాల్నీ కొంతవరకూ మరిచిపోగలిగి, ముందున్న అగాధ జీవిత పరిమితిలోని కొంతకాలాన్ని వెళ్ళబుచ్చే సాధనంగా ఉపయోగపడది. ఈ కొత్త వాతావరణానికి అలవాటు పడటాన్ని నేర్చుకొన్నా. కనకం. జ్ఞాపకమొస్తూనే వుండేది. పూర్వం ఆమెతో గడిపిన ఆ మధురతమ క్షణాలూ, నేను వస్తూన్నప్పుడు ఆమె ఖిన్న వదనంతో నా ఎదుట నిలబడ్డ విషాదమూర్తి—నాకు స్మృతికి వొచ్చి—ఈ జీవితమే వెగటనిపించేది! గడిచిన కాలాన్ని, మరిచిపోవాలని శతవిధాల వ్యర్థ ప్రయత్నం చేసేవాణ్ని. ఇది సులభంగా సాధించగలుగుతే మానవ జీవితం ఇంతకష్టభూయిష్టంగా ఉండదేమో! ఒక కొత్త పాఠాన్ని నేర్చుకొన్నా: ఈ లోకంలో ఎంత సౌఖ్యం వుందో, అంత కష్టమూ వుంది! అన్నీ వెన్నెల రాత్రులూ కావు; అన్నీ చీకటి రాత్రులూ కావు! కనకానికీ నాకూ మధ్య కొన్నివందల మైళ్ళు అడ్డున్నా లేఖల్లోనే ఒకళ్ళతో ఒకళ్ళం మాట్లాడుకునే వాళ్ళం. ఆ మాటలు మరింత కలవరపరిచేవి. స్నేహితుల్తోనూ వినోద ప్రదర్శనాల్తోనూ కాలాన్ని గడిపి, మనశ్శాంతి కోసం ప్రయత్నించేవాణ్ని. ఇదంతా, కలిసి నాలో ఒక నిశ్చయానికి తావిచ్చింది; జీవితంలో ఇక ముందెప్పుడూ ఏ స్త్రీతోనూ సంబంధం పెట్టుకొని, మధన పడకూడదని.

మన అనుభవమంతా మనకు సహాయ పడుతూ, దాన్ని క్రమమైన పద్ధతిలో ఉపయోగించుకునే శక్తి మనలో వుంటే—జీవితంలో వెనక్కు తిరిగి చూసుకుంటూ, రెండోసారి అల్లాటివి చెయ్యకుండా వుండ

గలిగితే—జీవితం ఇంత బాధగా వుండదేమో? ఏమైనా 'అనుభవం' అన్నది కొంత విజ్ఞానాన్నీ కొత్త పాఠాన్నీ నేర్పుతుంది. నాలాగే హృదయపూర్వకంగా ప్రేమించిన ప్రియురాళ్ళను వదిలి రాలేదా—ఈ విద్యార్థుల్లో కొందరన్నా? వాళ్ళు మానవులు కారా? ఇంకోరి జీవితానికి నాది పోల్చిచూసుకొని—మనకు తోడుగా మరికొంద రున్నారని తెలుసుకొని—ఒకవిధాన ఊరటను సంపాయించాను.

కాలేజీకి దసరా శెలవలిచ్చేందుకు ఇంకోవార ముందనగా నాకో టెలిగ్రాం వొచ్చింది. అమ్మ టైఫాయిడ్ జ్వరంతో మంచం పట్టి నట్టూ, నన్ను వెంటనే బైలుదేరి రమ్మనీ దాంట్లో వుంది. ఈ మాట లకు ఎక్కడ విలువవున్నా లేకున్నా—టెలిగ్రామ్‌లో వాటికున్న విలువ మరేస్థానంలోనూ ఉండదు! ఒకవిధమైన భయంతోనే ఇంటి కొచ్చా. ఆతృతతో నాన్నను చూశా; ఆయనముఖంలో విచారంలేక పోలేదు. అమ్మను చూశాక కొంతఆతృత తగ్గింది. దీనస్థితిలో వున్నా ఆమె నన్ను కావిలించుకు ఏడ్చింది. వారంరోజుల్నుంచీ జ్వరంవొస్తూ న్నట్టూ, ఇప్పుడు జ్వరతీవ్రత తగ్గినట్టూ విన్నా. ఏమైనా ఆమె పూర్తి గా ఆరోగ్యవంతురాలైతే కాని, మళ్ళీ కాలేజీకి వెళ్ళదల్చుకోలేదు.

ఆ సాయంత్రం పాత స్నేహితురాలింటికి వెళ్ళా. ఆమె తల్లి నన్ను చూసి, "ఎప్పుడొచ్చావ్—నాయనా?" అంది. ఆ మధ్యాహ్నమే వొచ్చానని చెప్పా. నన్ను కూర్చోబెట్టి ఆమె ఇంటివిషయాల్ని ప్రసం గించ నారంభించింది. ఈ మూడునెల్లకే నేను కౌమార దశనుంచి, యవ్వన దశలోకి వొచ్చేసి, మంచి లోక జ్ఞానాన్ని సంపాయించా నని ఆమె అనుకొని వుంటుంది.

"కనకానికి పెళ్ళిచెయ్యాలనుకుంటున్నా—బాబూ!" అంది. నెత్తిన పిడుగుపడ్డట్టయింది; గుండె ఆగినట్టయింది. నాదనుకుంటూన్న కనకం పరాయి సొత్తయిపోతుందా! ఆమెకోభర్తా? వాడికో అధి కారమా? మనస్సులో పరుగుడుతూన్న వివిధ భావాల్ని దాచేసి, "ఎప్పుడు?" అన్నా మామూలు ధోరణిలో.

"రేపు—వైశాఖంలో—"

వీలైనన్ని వివరాలు లాగుదామని, "ఎవరి కిస్తారు!" అన్నా.

"పరాయివాళ్ళ కాళ్ళుపట్టుకుంటే ఏం లాభం—నాయనా? చిన్నతనంనుంచీ అల్లారు ముద్దుగా పెరిగింది. విధివశాన విధవరాలైంది ఇప్పుడు విధవా వివాహాలు శాస్త్రసమ్మతమేనని ఒప్పుకుంటున్నారట గా! దాని జీవితాన్ని పాడుచెయ్యాలని నాకు లేదు. దానికి 'నా' అనే తుదిదాన్ని నేనేగా! నా నాల్గో తమ్ముడున్నాడు. వాడూ మొదటి భార్యను మొన్నీమధ్యనే పోగొట్టుకొన్నాడు. వాణ్ణొక ఇంటివాణ్ణి చేసినట్లూ అవుతుంది. నా అభిలాషా, దాని సరదాలూ కూడా తీరుతయ్..."

రెండో పెళ్లినేప్పటికే నాకుఅనుమానంవేసింది. ఈమె వయస్సును పట్టి, ఈమె తమ్ముడి వయస్సును ఊహించుకుంటూ, "ఆయనకు ఎన్నేళ్ళుంటాయ్!" అన్నా.

"ఎబ్బె! ఎన్నోనా!" అని, లోలోపల గుణించుకొని అంది: "ముప్పైనాలుగూ, ముప్పైఐదూ...అంతే! కరణీకం వుంది; కొంచెం సంపాయించాడు. మంచి పలుకుబడి వుంది; సంస్కారాభిలాషి..." ఇంకేమేమిటో నేను ఎరగని ఆ మహాశయుడి సుగుణ పంపరను ఏకరువు పెట్టింది. వినీ వినీ నాకు విసుగు పుడుతూన్నా ఈ చెవుల్ని మాత్రమే ఆమె మాటలకు వొప్పగించి, ఊహాప్రపంచంలో కనకం వివాహ మహోత్సవాన్ని గూర్చి వితర్కించుకొంటున్నా. ఉపోద్ఘాతమంతా అయ్యాక, "నీ ఉద్దేశం?" అంది.

"మంచిదే!" అన్నా ఆమెను ఆ ప్రస్తుత సందర్భంలోనన్నా పైకి తృప్తిపరుద్దామని. నా ఉద్దేశం తన ఉద్దేశంతో ఏకమైనట్లు తెలుసుకొని, చిరునవ్వు నవ్వింది.

"కనకం—ఏదీ?" "పైన వుంది—వెళ్ళు—"

మెల్లిగా లేచి వెళ్ళి బరువైన హృదయంతో మేడ మెట్లెక్కుతున్నా. ఒక నల్లటివాడు—బలిష్ఠంగా, మిడిగుడ్లతో, బ్రష్షులాటి

మీసాలు వేసుకొని జగి వొస్తున్నాడు; ఒకళ్ళ కొకళ్ళం ఎదు రైనాం. నావైపు తీక్షణంగా చూస్తూ మోటుగా, "ఎవరికోసం?" అన్నాడు—ఆ యింట్లో అంతా వీడి సొమ్మే అయినట్టు! వీడెవడు? రాక్షసుడా? మానవుడా? నాలాగే యీ స్థలాన్ని మరగలేదు కదా! కనకం చేతిని చవిచూచే ఘట్టాన్ని ఇంకా దాటాడా? లేదా!

"కనకంకోసం" అన్నా. "ఊఁ." అని దీర్ఘంతీసి ఉరిమి చూస్తూ దిగిపొయ్యాడు. కనకం చేమంతిదండకు చివరి ముడివేసి పళ్ళతో దారాన్ని తెంపుతోంది. మాట్లాడకుండా ద్వారందగ్గర నిలబడి ఆమెలో మార్పుల్ని కన్నార్పకుండా చూస్తూన్నా.

రెండు నిమిషాలకు తలెత్తి చూసి, ఉలిక్కిపడి—ఆశ్చర్యంతో ఆమె అంది; "రాజూ! ఎప్పుడొచ్చావ్? వొస్తున్నట్టు ఉత్తరం కూడా లేదే! రా...ఇంకా అక్కడే నిలబడ్డావేం? ఎన్నాళ్ళైనా కొత్తేనా? ఆ కుర్చీలో కూర్చో...అబ్బ! ఎంత మారిపొయ్యావోయ్! ఆ చేతికి మణిబంధనా? పొడుగు ఎదిగావే? ఇంకెప్పటికీ ఎదగవనుకొన్నా! చిక్కిపొయ్యావ్...దిగులుపడి, నీళ్ళు పడక చిక్కిపొయ్యావ్—కదూ? ఎన్ని ఫ్యాషన్లు నేర్చావోయ్! ఎల్లాగైనా కాలేజీ స్టూడెంట్‌వి కదూ! మూతిమీద రెక్కలు విరిగిన తుమ్మెదల్ని అటొకదాన్నీ, ఇటొకదాన్నీ అంటించినట్టు—ఫ్రెంచికట్టు పెట్టించావే...!" ఇంకేమేమిటో గుక్క తిరక్కుండా వాక్ప్రవాహాన్ని వొదిలేసింది.

కనకంకూడా బాగా మారిపోయింది. ఆ కళ్ళల్లో కొంటెతనం గోచరమవటంలా. ముఖం అదో విధమైన దైన్యంతో వుంది. నాలాగు దిగులుపడి నలిగి పోయిందా?

"ఎందుకొచ్చినట్టు?" అంది—ఎందుకు వొచ్చానో—అదంతా చెప్పా.

"మీ అమ్మగారికి ఎల్లా వుంది?"

"ఒక మాదిరిగా వుంది—" ఇద్దరమూ కొన్ని నిమిషాలపాటు ఒకళ్ళనొకళ్ళం చూసుకున్నాం. 'అల్లా అయిపోయ్యావేం!' అని ఆ చూపులే ఒకళ్ళ నొకళ్ళను ప్రశ్నించి వుంటయ్. సమాధానం లేక, రాక, ఆ శూన్య దృక్కుల్లోనే ఉక్కిరి బిక్కిరయ్యాం.

"నాకేం తెచ్చావు—పట్నంనుంచి?" అంది—అలనాడు శ్రీకృష్ణుడు, పాతస్నేహితుడు కుచేలుణ్ణి అడిగినట్టు. నేనేదన్నా తెస్తానని ఆశపెట్టుకు కూర్చుందా? లేక నా చేతులో కాగితాల మడతల మధ్యవున్న పెట్టెను గుర్తించి అడిగిందా?

ఇచ్చా—విప్పిచూసి తనలో తను సంబరపడుతూ అంది: "మంచి టాయిలెట్ సెట్టు...ఎంతైంది...అబ్బ! నాకోసం పది రూపాయిలెందుకు తగలేశావు!"

'అబ్బాయి డబ్బును అవసరపడతాడేమోనని ఇంటిదగ్గర్నుంచి వొచ్చే ఉల్లాఖబ్బు ఇలాంటి వాటికైనా ఉపయోగపడదా?' అనుకున్నా.

"ఈ కుంకం బరిణ—ముద్దొస్తోంది—"

"రేపు పెళ్ళిలో ఉపయోగపడుతుందిలే—" 'అప్పుడే నీ చెవిన కూడా పడ్డదా?' అన్నట్టు చూస్తూ, ఆ టాయిలెట్ పెట్టెను అవతలికి తోసి, గట్టిగా ఊపిరపీల్చి, "ఎవరు చెప్పారు?" అంది.

"ఎవరైతేనేంలే—" కనకం ఇంకోళ్ళదై పోతోందేమోననేభయమూ, ఆ కాబోయ్యే 'మామగాడి' మీద మండిపొయ్యే గుండా, జలసీ, విచారమూ అన్నీ ఆవరించాయి.

"నువ్వు నమ్మ్నావా!" అంది నాకళ్ళల్లోకి చూస్తూ.

"అబద్ధమా?" "నువ్వు చెప్పు రాజా! చేసుకోమంటావా!"

అసమ్మతి అయినా, తలవూపా—ఎందుకో నాకే తెలీదు.

"ఎందుకు చేసుకోవాలో చెప్పు—?"

"ఎందుకేమిటి? లోకంలో అందరూ ఎందుకు చేసుకుంటున్నారు? కారణాలైతే నేను చెప్పలేను కాని..."

"నా కిష్టంలేదు—" "అదేం? ఒకసారి ఐంది కదానినా ?"

"కాదు—" అని ఒక శక్తిని లోన ప్రవేశింప జేసుకున్నట్టు గట్టిగా గాలిని పీల్చి అందుకుంది:

"ఈ పెళ్ళిళ్ళు—స్వేచ్ఛనూ, స్వాతంత్ర్యాన్నీ అరికడతాయి. చేసుకున్నదాకా వుండే ఉబలాటం చేసుకున్నాక వుండదు. ఈ పురుషుడు నా భర్త: ఈ స్త్రీ నాభార్య—ఈ 'నా'తో ఒకళ్లు ఒకళ్ళకు ఆయుధమైపోతారు. ఇదేమన్నా వస్తువా? వ్యక్తా? భార్యను గదుల్లో పెట్టితాళాలువేసి, కదల్నీకుండా, మెదల్నీకుండా అదుపూ, ఆజ్ఞా, ఆచారమూ, ఆంక్షా......ఇంకా ఎన్నింటికో బద్ధురాల్ని చేసి వ్యక్తిత్వాన్నీ, మానవత్వాన్నీ కూడా చంపే భర్తలూ నాకు తెలుసు; ఆవకాయముక్క జాడీలో మాగినట్టు—జీవితమే మాగి మసయి పోతుంది. భార్యలంటే కామ తృష్ణను తీర్చే రబ్బరుబొమ్మలకింద జమ కడతారు. వివాహం అడి లేని ఖైదును కొని తెచ్చుకోవటం; తెగని ఉరితాటిని మెడకు తగిలించుకోవటం !—ఈ సమాజంలో, ఈసంఘంలో, ఈ ప్రభుత్వంలో భర్త, భార్యకు ఎంత అపకారాన్నైనా చెయ్యవొచ్చు. ఇంత మంది పెద్దమనుషులూ, నీతినియమాలు తెలిసి ఆచరణలో పెట్టమని చెప్పే ఘరానా మనుషులూ—అందరూ గంగిరెద్దుల్లాగు తలలూపి, రెండు కళ్ళనూ వొప్పగించి, నోరు సగానికి తెరచి మాట్లాడకుండా చూస్తారు. ఏవేవో పిచ్చి భ్రమలు పెట్టి—'ఈ పాలాల్ని చూడు. ఈ తోటల్ని చూడు, యీ కార్లను చూడు, ఈ రేడియోనిచూడు, ఈ పందిరిమంచాన్ని చూడు, ఈ గౌరవాన్ని చూడు ఈ కరెన్సీనోట్లబొత్తగను చూడు. ఈ అత్తగనుచూడు'...అని... వాటితోనే తృప్తి పడమని హితబోధను టానిక్కుల్లాగు పనిచేసేట్టు చేస్తారు. ఏ విధంగానన్నా యీ లోకానికి పనికొచ్చే శక్తి ఒకవేళ ఆ స్త్రీలో వున్నా—భార్య అయ్యాక మాత్రం ఆమె ఎందుకూ, ఎవరికీ, పనికిరానిదిగా మారిపోతుంది. ఒకవేళ ఆ స్వాతంత్ర్యంకోసం పోట్లాడబోతే 'నేను నీకు అన్నం పెడుతున్నాను ; గుడ్డ యిస్తున్నాను

విశ్వాస విహీనురాలిగా ప్రవర్తిస్తారేం?' అని గదమాయిస్తారు; ఉంపుడు కత్తెకూ భార్యకూ ఇంకేమిటి తేడా? ఈసమాజంలో 'భార్య' కన్న 'వేశ్య' అవటం మంచిది. ఆ వేశ్యకైనా ఇష్టా ఇష్టాల్లోనూ, స్వేచ్ఛతోనూ కొంతవరకూ బాంధవ్యముంటుంది. భార్యఐతే కోరలు పెరికిన పామై, ఆత్మగౌరవాన్ని ఆహుతి ఇవ్వాలి. ఎక్కడ ఏ పురుషుడి కంట పడుతుందోనని కాపలాలూ, ఇంట్లో ముసలమ్మల ప్రబోధాలు, పాతివ్రత్య మహాత్మ్యాలు, భక్తి పారవశ్యాలు, భజనలు ...అబ్బో! చుట్టూ మూళ్ళ కంపలే, తాము సంతుష్టి పడ్డట్టూ, కాపరం బట్టబయలు కాకుండా పరువూ మర్యాదా నిలుపుకోవాలనీ, తమ లోపాల్ని, తమ కష్ట నష్టాల్ని నలుగుర్లో చెప్పుకోవటం సిగ్గనీ, ఒకవేళ చెప్పుకున్నా అవ్వి తీరక పోను తమను చూసి నలుగురూ నవ్వుతారనీ—పైకి మాత్రం తాము మహా అదృష్టవంతులైన ఇల్లాళ్ళలాగు మేకపోతు గాంభీర్యాన్ని ప్రకటించే యీ భార్యలు—వీళ్ళ సంగతి చాలా మందికి తెలిసినా ఎవ్వరూ పైకి అనరు. విధిలేక భర్తల దగ్గర పడివుండే యీ భార్యలకు ఇప్పుడు ప్రభుత్వంవారు పర్మిషన్ ఇస్తే చాలు-అనేకవేల సంసారాలు విచ్ఛిన్నమైపోవూ? అంతా అశాంతి ప్రబలిపోదూ?..." ఎక్కడ చదివిందీ ఇంతఉపన్యాసాన్ని!

"అయితే అందరూ భర్తల దగ్గర ఇల్లాగే ఉన్నారంటావా?"

"ఉండక ఏం చేస్తారు? వాళ్ళగోల ఎవరు వింటారు! అంతా కంఠశోష—అరణ్య రోదనం! లేని ధైర్యాన్ని తెచ్చుకొని, భర్త పాదాల కిందపడి నలగటాన్ని భరించలేని భార్య, బైటపడితే—అటు పుట్టింటికీ, ఇటు అత్తారింటికీ కూడా నీళ్ళధారేగా! ఏమౌతుంది. అప్పుడామె గతి?—"

"ఇష్టంలేకుండానే వీళ్ళందరూ కాపరాల్ని చేస్తున్నారంటావా!"

"నువ్వు చూడటంలా? నేను ఎరిగినంత వరకూ, విన్నంతవరకూ, కన్నంతవరకూ నా దృష్టికి ఇల్లాటివాళ్ళే తగులుతున్నారు..."

"వివాహ వేదికకూ, కర్తకూ—పవిత్రతా, విలువా లేదనే

అంటావా ?"

"ఈ మంత్రాలకు మామిడికాయలు రాల్తాయా ? ఇంకా ఇక్ష్వాకులనాటి బూజుపట్టిన నమ్మకాలమీదనే వుందీ నీ లక్ష్యం ? నిజంగా ఆ మంత్రాలకు ఇంత విలువే వుంటే ఇన్ని సంసారాలు యిల్లా ఎందుకు తారుమారవుతున్నాయ్ ? శుభలగ్నంలో చేసే ఇన్ని వివాహాలూ ఇల్లా ఎందుకు ఏడుస్తున్నయ్ ? ఇంతమంది వితంతువు లెందుకు తయారౌతున్నారు ? 'అంతా విధి!' అంటారు—లగ్నం పెట్టేటప్పుడు లెక్కకురాని విధి, భర్త చచ్చేటప్పటికి సమయానుకూలంగా దక్కిన తయారౌతాడు ! మనం ఆ కర్మకాండకు కొంత విలువను ఏర్పరుచుకున్నాం—ఆ విలువకు ఈ దంపతుల్ని ఒక గిరిలో, అదుపులో, ఆజ్ఞలో నిలబెట్టవొచ్చనే ఉద్దేశంతో ! ఈ మంత్రాలూ, నోములూ ప్రేమను తెచ్చిపెడతయ్యా ? ఈ పెళ్ళిళ్ళకూ, వ్యభిచారాలకూ ఒక్కటే భేదం ! వ్యభిచారాన్ని ప్రభుత్వమూ, సంఘమూ—ఎవ్వరూ ఒప్పుకోరు. కాని కాపరం అంటే అందరి అనుమతిమీదా సాగించే లీగల్ వ్యభిచారం—ఎంత గొప్ప సంబంధమన్నా తెగుతుంది కాని—ఈ దాంపత్యపు శృంఖలాలు ఏలోహంతో చెయ్యబడ్డవో కాని, అవి మాత్రం తెగవు ! భూకంపం వొస్తున్నా 'నా భార్య' 'నా భర్తే!' ఇదీ మన వివాహపుతంతు !" ఇదేమిటా ఇల్లా పిచ్చిగా మాట్లాడుతుందని చూస్తున్నా. ఆమెతో పోట్లాడటం మంచిది కాదనుకున్నా. వివిధ వ్యక్తులకు వివిధ రుచులూ, భిన్న ఆశయాలూ వుండటం ఈనాటికి కూడా కొత్త కాదుగదా !

"పోనీ మీమామంటే నీకు ఇష్టంలేదా ?"

"నువ్వు చూడలా ఆయన్ని ? ఇందాక నీకు ఎదురయ్యే వుంటాడు ......అఁ. ఆ నల్లవాడే ! మంచివాడు; సరదామనిషి. నేనంటే పడి చస్తాడు. నాకూ వాడికీ ఈడేమిటి ? అసలు నాకు వివాహమంటేనే తలనొప్పి—నాకు రెట్టింపు వయస్సు వేసుకొని ఇంకా పెళ్ళాట, పెటాకుల్లు !"

"సంఘ సంస్కర్తటగా!" కనకం తల్లి ఆ మామగాడికి తగిలించిన కాంప్లిమెంటును ఇక్కడ విసిరి చూద్దామనుకొన్నా.

"పెళ్ళిచేసుకునేదాకా అల్లానే అంటారు. ఆ ఉచ్చులో పిట్ట పడ్డాకకాని దాని పని పట్టరు! పెద్ద ఉపన్యాసాలిస్తారు. తమ ఇంట్లో ఆడవాళ్ళకు తప్ప ఈ లోకంలో వున్న ఇతర స్త్రీలందరికీ స్వాతంత్ర్యం సంపాయించి పెట్టడానికి నడుములు బిగిస్తారు. వాళ్ళల్లోనే లేని 'సంస్కారం' ఇతర్లలోకి ఎక్కించాలంటారు—ఇవ్వేమో కలరా ఇంజక్షన్లూ, మలేరియా ఇంజక్షన్లూ, అని తలుస్తూ, మాటల్లో, పాటల్లో, రాతల్లో కోతల్లో ఉట్టిపడే సంస్కారం—వ్యక్తిగతంగా శూన్యం—అయన ఏమైతే నాకేంలే—"

"ఐతే ఎవర్నీ పెళ్ళాడవా!"

"ఈ జీవితానికి లేదు—" జ్యోతిష్కులుకూడా పప్పులో కాలేసే 'భావి' ని గూర్చి ఒక్కసారే చెప్పగలిగిందేమా అనుకున్నా.

"నువ్వో—" అంది. "ఏమో—చేసుకోమంటావా?"

"నీ ఇష్టం—నువ్వు నేనైతే చేసుకోబోక—" అంది నవ్వుతూ. రెండునిమిషాల పాటు గదిలో నిశ్శబ్దత తాండవించింది.

"మీ అమ్మకు చేద్దామని వుందట. అసలు ఆవిడగారు అవసరం కొద్దీ ఇల్లా సంఘ సంస్కర్తగా మారి నిన్ను చదివించిందేమో ననుకుంటా—" మా స్నేహ బలం చేతనే ధైర్యంచేసి గడుసు కనకం దగ్గర ఇంతమాట అనగలిగాననుకుంటా.

"ఛా...ఆమె ఉద్దేశం నాకు తెలీదు కాని....నేనే చదువుకుంటానంటే సరే నంది. నువ్వు చెప్పిన రకమూ ఉన్నారులే! అవసరంకొద్దీ మామ ఇప్పుడు సంఘ సంస్కర్త వేషాలు వేసి—ఏమేమిటో చెప్పటంలా?"

"ఇంకా లెంపకాయ పడలా?"

నవ్వి అంది: "నీకు తగిలిందని—అందరికీనా? అసలు ఆమాత్రపు గడుసుతనమన్నా చూపకపోతే స్త్రీ జీవితం కష్టంలే!" అయితే

నేను అవసరం కొద్దీ తిన్నదెబ్బ !

బంగారు రంగుతో నీరెండ ఆమె ముఖాన్ని ముద్దాడుతోంది.

"రాత్రికి ఇంటిదగ్గరే పడుకో—ఇక్కడకు రావోక—మామకు అనుమానం—" అమ్మ దగ్గరుండాలి; ఎల్లాగూ రాను కాని, ఈ మామ—వీడెవడు—పానకంలో పుడకలాగు! ఆ పిచ్చి గబ్బిళాయి గాడిమీద ఉన్నవి కొన్నీ లేనివికొన్నీ కలిపి వాణ్ణొక ఊహా పాత్రగా నా జలసీ అంతా బైటపడేట్టు కనకానికి నవరస భరితంగా చెప్పాం. నవ్వి, "అప్పుడే నీకూ—డా జలసీ పుట్టింది! ఏం! వాడూ వుంటాడు—లోకంలో ఎంతమంది లేరు!" అంది.

నా ప్రయత్నం భగ్నమైందని, 'పోనీలే' అని మళ్ళీ అనుకొని, "సరే—వెళ్తా"నంటూ లేచి నిలబడ్డా.

"ఈ చెండు తల్లోపెట్టు" అంది వెనక్కి తిరిగి వేణీభరాన్నీ, చెండునూ నాకు వొప్పచెప్తూ. మృదువైన ఆమె కుంతలాల్ని సరిగా సర్ది ఆ చెండును తల్లో పెట్టా.

"వెళ్ళనా ?" అన్నా రెండడుగులు ముందుకు నడిచి.

"మళ్ళీ దర్శనం ?" అంది ప్రశ్నార్థకంగా నావైపు చూస్తూ.

"వీలైనప్పుడు—" నవ్వింది. బరువైన గుండెలో, ఆ చిరు చీకట్లను చీల్చుకుంటూ, మెల్లిగా పాదాల్ని ఎత్తి ఎత్తి వేస్తూ బైటపడ్డా.

# 11

అమ్మ శవాన్ని దహనంచేసి వొచ్చి గదిలో కూర్చొని విషాదాలోచనలోపడ్డాను. మాతృమూర్తి కౌగిట్లో పొందే ఆనందం ఈనాటినుంచీ మరిచిపోవాలి కాబోలు. నా కష్టాలకు హృదయపూర్వకంగా సానుభూతి చూపి కన్నీటిని కార్చే ఆత్మబంధువొకతె యీ లోకం నుంచి విరమించింది. లోకచరిత్రలోని మృత్యువుల సంఖ్యకు మరొకటి కలిసింది.

ఇన్ని రోజులూ కళకళ మంటూన్న ఇల్లు ఈనాడు స్మశాన వాటికలాగు—ఇసుకపర్రలాగు తయారైంది. లోకమంతటా చీకటి ఆవరించినట్లూ, ఆ అంధకారంలో దారి తెలీక తికమక పడుతూన్నట్టుగా భావించాను. అతిగారాబంగా పెంచినతల్లి—నా జీవితానికి 'తీరని కోరిక' అంటూ లేకుండా వుండేందుకు స్వార్థాన్ని కూడా త్యాగం చేసిన అమ్మను పోగొట్టుకొన్న నా జీవితంలో ఇక ముందున్నవన్నీ కాళరాత్రులుగానే కన్పింపసాగాయి. అన్నం తినక, కోపం వొచ్చి బిగతీసుకు పడుకున్న సమయాల్లో—సాగతీసి బతిమాలి, భంగపడి తన చేత్తో అన్నం కలిపి నానోటి కందించిన ఘట్టాలూ, శాశ్వత నిద్రలో నిమగ్నమయ్యేముందు, "నాన్నను కనిపెట్టి వుండు నాయనా! నేనూ నాన్నా కలిసి నాన్నే అనుకో! పెద్దవాడివయ్యావు; నీకు నాన్నా, నాన్నకు నువ్వుగా ఉండటం నీ విధి అని తెలుసుకో—ఆయనకూడా పెద్దవారయ్యారు: నీమూలాన ఆయనకు మనశ్శాంతి లభించాలి సుమా! త్వరగా పెళ్ళిచేసుకో బాబూ! నువ్వూ, కోడలూ కాపరం చేస్తూంటే చూసి ఆనందించే భాగ్యం యీ కళ్ళకు లేకపోయినా—నాన్నకన్నా ఆ భాగ్యాన్ని కలగనీ. ఇది నా తుది సందేశంగానూ నీ విధిగానూ తలుచు; అప్పుడే నా ఆత్మకు శాంతి..."...అని చెప్పిన అంత్యవాక్యాలూ జ్ఞాపకమొస్తున్నయ్. దెబ్బ తగిలినప్పుడు 'అమ్మా' అని కేకేస్తే, బాధలో అరుస్తే ఈ ఇంట్లో ఇంకెవరు పలుకుతారు?

నిన్నా, మొన్నా, ఈనాటిదాకా కూడా ఇంట్లోనే మంచాన వాలి చిక్కిన శరీరంలోనుంచి, గట్టిగా ఊపిరి పీలుస్తూ, నన్ను నిమిరిన అమ్మ అమాంతంగా మాయమైంది. ఇంకా ఇంట్లో ఎక్కడో ఉన్నట్టుగానే భావించి, భ్రమించి ఇల్లంతా గాలించా. ఆమె నగలూ, ఆమె కొన్న పాత్రసామానులూ, చీరెలూ, ఆమె పెట్లూ—అన్నీ యజమానురాల్ని కోల్పోయి ఏడుస్తూ మూల మూలల నక్కి కూర్చున్నయ్. ఆమెకు సంబంధించిన ఎంత చిన్నవస్తువైనా ఈ

నాటినుంచీ ఆమెను జ్ఞాపకం తెన్నూనే వుంటుంది. ఏ కంఠంలో నాకు మాధుర్యమూ, మృదుత్వమూ, మార్దవమూ స్ఫురించేవో, ఏ కమనీయకమైన గాజుల చప్పుడులో నాకు గంధర్వగానాలు వినిపించేవో—అవ్వి ఇక ముందుండవు కాబోలు! క్రమేపీ ఆమెనూ, ఆమె ఈ లోకంలో గడిపిన జీవితవిశేషాల్నీ కూడా నేను ఆమెకు ఆప్తులైన మరికొందరూ మరిచిపోతారు కాబోలు!

ఆమె తీయించుకొన్న పెద్ద ఫోటో మాత్రం హాల్లో వుంది. ఆమె స్వరూపాన్ని—ఛాయా రూపంలో ఆ యంత్రసహాయంతో—మన కళ్ళకింకా కన్పించేట్టు చెయ్యగలిగిన శాస్త్రజ్ఞుడూ, చిత్రకారుడూ—ఆమెకు ప్రాణాన్నిమాత్రం పొయ్యలేరుగా!

నా హృదయంలో ఎక్కడో, ఏ మారుమూలో దూరాన చిన్న ఆశాజ్యోతి క్షీణకాంతుల్తో మెరుస్తోంది. "అమ్మ మళ్ళా వస్తుందేమో!" తిరిగి వొస్తుందా? ఎందుకు వొస్తుంది! ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎందుకైనా చచ్చినవాళ్లు మళ్ళీ తిరిగి వొస్తారా? అది అసంభవమంటుంది కామన్ సెన్స్. మరి మాట్లాడకుండా ఆ చిన్న ఆశాజ్యోతిని గట్టిగా ఊది ఆర్పేశాను.

నన్ను కడుపులో పెట్టుకు కాపాడి, ఏ చేతుల్తో ఎతుకు తిప్పి పెంచి పెద్దచేసిందో కాని—కృతఘ్నుడనై యీ చేతుల్తోనే ఆమె మృతదేహానికి నిప్పంటించానే! కాలచక్ర గమనంలో అందరూ తుదకు నడిచే తోవనే ఆమెకూడా నడిచిపోయింది. మృత్యువులో ఎంత పరిణామం వుంది! తలుచుకుంటే ఆమెకూ నాకూ అంతులేని అనంత సముద్రాలు మొలుస్తున్నాయ్. ఆమెఅదృష్టవంతురాలు! ఆమె మృతికి విలపించే మేమే దురదృష్టవంతులం! ఈ విశాల విశ్వంలో రోజుకు, నిమిషానికి, క్షణానికి ఎంతమంది పోవటంలేదు! ఎంతమంది రావటంలేదు. అందులో ఆమె ఈనాటికి ఒకతె అయింది. ఆ ఒక్క ప్రాణీ విరమిస్తే—దానికి సంబంధించిన మరికొన్ని ప్రాణులు కొంతకాలం బాధపడతాయ్—మానవుడు, మానవుడికి సానుభూతి చూపాలని!

ఆవేళకు ఓదార్చి చూపే lip sympathy తోనే తృప్తిపడాలి. ఏదేదో పిచ్చి వేదాంతాన్ని ఆలోచించుకుంటూ, అడుగంటిన ఆశలతో శూన్యహృదయంలోనుంచే ప్రవహించే కన్నీటితో తలగడా తడుపుకుంటూ—ఎక్కడో వున్న అనంతమైన చీకటి మహాసముద్రాల్లోకి—నడిచి వెళ్ళాను.

## 12

గాజుల చప్పుడు విని కళ్ళు తెరిచా. ఎక్కడున్నాను? నా ఫాలభాగాన్ని తాకుతూన్న మృదుహస్తం ఎవరిది? అమ్మ మళ్ళీ తిరిగి వొచ్చిందా? గుర్తించా—కనకం! ఇక్కడికి, మా ఇంటికి ఎందుకు వొచ్చింది? ఏమిటీ బాధ? ఇంత నీరసంగా లేవలేని స్థితిలో—మంచంలో ఎందుకున్నాను? కనకం కళ్ళు చెమ్మగిల్లా యెందుకు? నీరస స్వరంతోనే అన్నాను: "కనకం! ఇల్లా వొచ్చావ్ దేనికి?"

ఆమె కళ్లు తుడుచుకొని, "చెప్తాలే—ముందు మందు తాగు" అంది. ఔన్స్‌గ్లాస్‌లోని ఎర్రని మందును, నా నోటిదగ్గర పెడుతూ.

ఆమె కళ్ళల్లోకి చూస్తూ, "మందెందుకూ?" అన్నా.

"తా—గు" ఆమె కళ్ళల్లో నన్ను ఆజ్ఞాపించే శక్తి వుందేమో! —కిక్కురుమనకుండా మందు ఒక్క గుటక తాగా.

"ఛీ...ఛీ—వెధవ చేదు మందులు—"

"నా కోసం తాగవూ? నామాట వినవూ?" అంది దీనంగా చూస్తూ, ఫాలభాగంమీది వెంట్రుకల్ని పైకిత్రోస్తూ. కళ్లు రెండూ గట్టిగా మూసుకొని ఎల్లాగో గొంతులోంచి మందు వెళ్ళ పంపిచ్చాను.

"చేదు...చేదు..."

"ఈ లవంగం వేసుకో—"

నోరు కొంచెం బాగుపడ్డది. ఏమేమి సంగతులో జ్ఞాపకమొస్తు

న్నయ్. తల గిర్రు గిర్రున తిరిగిపోతూంది. కనకం నా ప్రక్కనే ఉన్నట్టు తెలుస్తూనే వుంది. నా శరీరం నాకే వేడిగా, ఆ భారాన్ని మోసే శక్తినిగూడా కోల్పోయినట్టు నీరసంగా వుంది. అందకుండా పరుగెత్తుకుపోతూన్న Presence of mind ను బలవంతాన చిక్కబట్టుకుంటూ — అర్థంలేని శూన్యదృక్కుల్లో కనకాన్ని చూడసాగాను.

"ఆకలవుతోందా ?" తలవూపా.

ఫ్లాస్కులో కాఫీని గాజుగ్లాసులో తెచ్చి, మెల్లిగా నన్ను పట్టుకు కూర్చోబెట్టి తాగించింది. నరనరాల్లోకి ప్రవహించిన ఆ వేడి కాఫీ నాలో ఇంకా ఎక్కడో మిగిలి ఒదిగి కూర్చున్న శక్తిని మేల్కొల్పింది.

"కనకం ! అన్నమయిందేమో కనుక్కొస్తావూ ?"

ఆమె పమిట చాటున నవ్వి, "పిచ్చి రాజూ ! అన్న మేమిటి ? నీకు జ్వరమని—నీకు తెలీదూ ?" అంది.

"ఎన్నాళ్ళనుంచీ ? ఏం జ్వరం ?" అన్నా. ఈ పెద్ద నిద్దురలో నాకు అంతా ఏదో కలలాగు, తెరపైని చూచే సినిమా బొమ్మల్లాగు వుంది. మూడుసేళ్ళను ముడిచి చూపింది. నాకు తెలీకుండా—సూర్యుడు నన్ను రెండుసార్లు చూచి వెళ్ళాడా ? రెండుసార్లు భూమి తన చుట్టూ తను నాకు తెలీకుండానే పరిభ్రమించిందా ? రెండు దినాల్లోనూ ఏం జరిగింది ? బాగా గుర్తులేదు.

"నువ్వు మతిలేకుండానే పడివున్నావ్—" అంది. 'ఉహు.' అనుకొన్నా.

"అమ్మ చచ్చిపోయింది; ఈలోకంలోని బాధలకు నేను కూడా చచ్చి బతికాను—"

"పోనీ—నాన్న చచ్చిపోతే నే నెల్లా వున్నాను ? మానవుడికి పుట్టుక ఎంత అవసరమో. చావుకూడా అంత అవసరమే ! తల్లిలేని వాళ్ళు లోకంలో ఎంతమంది లేరు ? అందులో నువ్వొకడి కా

తావ్—మాటమాటకూ ఆ విషయాన్ని జ్ఞాపకం చేసుకొని బాధ పడతావ్ దేనికి?"

"నేను కూడా పోతే బాగుండును నేనెందుకింకా ఈ లోకం లో!" అన్నా. అదో విరక్తినన్నా క్షణంలో పూర్తిగా ఆవరించి లొంగదీసుకొని వుంటుంది.

పమిటతో విసురుతూ కళ్ళు పెద్దవిచేసి అంది: "నాకొక్కవాలి, తెలిసిందా! నాకోసం నువ్వూ, నీకోసం నేను బతికివుందాం. ఏం!" గడ్డం పట్టుకొని బతిమాలుతూ నావైపు దీనంగా చూసింది.

"నాన్న ఏడీ!"

"బైట ఎవరితోనో మాట్లాడుతున్నారు."

"ఇక్కడికెల్లా వొచ్చావ్?"

"నాకు కాళ్ళులేవూ?" అంది నవ్వుతూ.

"అది కాదు—నీకెవరు చెప్పారు?"

నిట్టూర్చి అంది: "మీ నాన్నగారు కబురంపారు. నీకు మతి పోయి...కనకం...కనకం...అని కలవరించావట. అప్పుడు ఇంకే మేం బైటపెట్టావో ప్రబుద్ధుడివి! మందిస్తే పెదిమలు బిగిస్తావట. యెవరైనా వొస్తే తిట్టి పంపుతావట! ఆడవాళ్ళు వొస్తే 'కనకం' అని పిలుస్తావట! వాళ్ళు నవ్వుకుంటూండట! నీలాగు హృదయ దౌర్బ ల్యం యెక్కువ మోతాదులో వుంటే—జీవించటమే కష్టం! ఆ డాక్టర్ను...కొట్టావుటగా?" ఇదంతా నాకు తెలీకుండానే జరిగిందా!

"నిన్ను కూడానా?"

"లేదులే—అప్పుడు వొచ్చినట్టయితే ఏం చేసేవాడివో కాని —" అర్థోక్తిలో ఆగింది. రెండు నిమిషాలు నిశ్శబ్దంతో గడిపాం.

"కనకం! ఈ సాయంత్రందాకా ఇక్కడ వుంటావూ?"

"ఇది ఉదయం అనుకుంటున్నావూ? పిచ్చిలో పడిపోతున్నావ్ ...రాజూ! నేనూ విన్నాను కన్నాను. కాని ఇంతగా మతి భ్రమిం

చిన్న వాళ్ళను ఎక్కడా ఎరగను పడుకో—రేపు చెప్తాలే...విసరనా? ...కళ్లు మూసుకో...మధ్యమధ్య కళ్ళు తెరుస్తూనే వున్నా; ఆమె చేతి వేళ్ళతో వారిస్తూనే వుంది.

ఒక రాత్రివేళ లేచి చూస్తే నాకు దగ్గరగా నాన్న పడుకొని వున్నాడు. బైట ఏమీ కన్పించనంత చీకటి దట్టంగా అల్లుకొనివుంది. సన్నగా లాంతరు మూలన వెలుగుతోంది. జరిగిందంతా ఒక కల లాగు వుంది.

# 13

వేలుకొనే కళ్ళు మూసుకొని పడుకొని వున్నా. నాకు సమీపంలో మాటలు విన్పిస్తున్నాయ్. ఒక కంఠం బాగా పరిచయమైందే! నాన్నది.

"మందు తాగాడా?"

"అది వొచ్చి ఇస్తే తాగాడు—"

"నేను చెప్పలా—ఇది యీ రకం జబ్బని!"

"దీనికింక మందులేదా?"

"మనోవ్యాధికి మందేమిటి? నేను చెప్తాలెండి—ఉపాయం—" నాన్న తట్టి లేపుతూంటే, కాస్సేపు నిద్ర నటించి లేచా. డాక్టర్ పరీక్షించి నాన్నవైపుతిరిగి, "ఇవ్వాళ మందు మారుద్దాం—"అన్నాడు.

"ఆకలేస్తోంది—" అన్నా 'ఆదేదో త్వరగా తేల్చమ'న్నట్టు చూస్తూ.

"తొందరెందుకు? నన్ను మరి కొట్టకుండా వుంటావా?" అన్నాడు గ్రిఫించి కట్టు మీసంలోంచి సన్నగా నవ్వి—నాన్నవైపు తన 'విట్టు'ను చూడమన్నట్టు చూస్తూ.

"ఈ చేదు మందులు నేను తాగను...తాగను...అన్నం పెట్టించండి..." అన్నా. ఈ స్థితిలోవున్న నామీద ఎవరికేం కోపం

